# వసంతసేన

(తొమ్మిది రంగాలుగల రూపకం)

A stage version of the play
Mrchakatika
of
SUDRAKA
in
Telugu Prose.

ప్రథమ ముద్రణం
మే 1953–1000

## హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే, లేక సొమ్ము వసూలు చేసుకొనే నిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఎదైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘంవారున్నూ ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం కాపీరైట్ చట్టప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరువాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

వెల
రూపా ౧౦౦

# వసంతసేన

## రంగాల పేర్లు

(1) నగ బాపరికం (2) జూదరికి అభయం (3) సువర్ణహరణం (4) కొంగసొమ్ము దొంగాడే వాపస్ ఇయ్యడం (5) బళ్ళ మారిళ్ళు (6) యువకుడికి అభయం (7) స్త్రీహింస (8) విచారణ (9) ధర్మవిజయం.

## పాత్రలు

చారుదత్తుడు—(తన సర్వస్వమూ ఇతరుల కిచ్చివేసిన దరిద్రుడు)

మైత్రేయుడు—(చారుదత్తుని మిత్రుడు)

రోహసేనుడు—(చారుదత్తుని కొడుకు)

వర్ధమానకుడు—(చారుదత్తుని బండివాడు)

ధూతాదేవి—(చారుదత్తుని భార్య)

రదనిక—(చారుదత్తుని ఇంటిదాసి)

వసంతసేన—(ధనధాన్యమైన చారుదత్తుని సుగుణాల్ని ప్రేమించిన వేశ్య)

మదనిక—(వసంతసేన ఇంటిదాసి)

శకారుడు—(రాణిగారి తమ్ముడు)

విటుడు—(బొత్తిగా చెడిపోని కాముకుడు)

స్థావరకుడు—(శకారుడికి పుట్టినవాడు; బండివాడు)

చందనకుడు—(చారుదత్తుడికి అనుకూలుడైన రాజసేవకుడు)

వీరకుడు—(రాజపక్షాభిమానంగల రాజసేవకుడు)

ఆర్యకుడు—(రాజరికం చెయ్యగల జోస్యం చెప్పబడ్డ గొల్ల యువకుడు)

శర్విలకుడు—(కన్నపుదొంగ)

సంవాహకుడు—(ఒళ్లు పట్టేవాడు)

అధికరణికుడు, శోధనకుడు, శ్రేష్ఠి, కాయస్థుడు } (నేరవిచారణ సభ్యులు)

అహింత; గోహ—(చండాలురు)

# ప్ర సం క్షే ప

| పాత్ర : | వచ్చే రంగాలు | పాత్ర : | వచ్చే రంగాలు |
|---|---|---|---|
| చా— | 1, 3, 6, 8, 9 | వి— | 1, 7 |
| మై— | 1, 3, 4, 6, 8, 9 | స్థా— | 5, 7 |
| గో— | 5, 9 | చం— | 5, 9 |
| వర్ధ— | 5, 6, 9 | వీ— | 5, 8 |
| ధూ— | 3, 9 | ఆర్య— | 5, 6 |
| ర— | 1, 3, 5, 9 | శర్వి— | 3, 4, 9 |
| వసం— | 1, 2, 4, 5, 7, 9 | సం— | 1, 7, 9 |
| మ— | 2, 4 | ఆగ్నే, శో, శ్రే, కా— | 8 |
| శకా— | 1, 7, 8, 9 | ఆహిం, గో— | 9 |

| రంగం : | వచ్చే పాత్రలు |
|---|---|
| 1. — | చా, మై, ర, శకా, వి, వసం |
| 2. — | సం, వసం, మ |
| 3. — | మై, చా, శర్వి, ర, ధూ |
| 4. — | వసం, శర్వి, మ, మై |
| 5. — | క, వసం, గో, వర్ధ, స్థా, ఆర్య, చం, వీ |
| 6. — | మై, చా, వర్ధ, ఆర్య |
| 7. — | శ, వి, సం, స్థా, వసం |
| 8. — | ఆగ్నే, శో, శ్రే, కా, శకా, చా, వీ, మై |
| 9. — | ఆహిం, గో, చా, గో, మై, సం, వసం, శర్వి, శ, చం, ధూ, ర, వర్ధ |

సంకేతములు : (నటించేవారికి)

RF - కు. ఎ - కుడిఎదర
RM - కు. మ. - కుడిమధ్య
RB - కు. వె. - కుడివెనక
LF - ఎ. ఎ. - ఎడమఎదర
LM - ఎ. మ. - ఎడమమధ్య
LB - ఎ. వె. - ఎడమవెనక
MF - మ. ఎ. - మధ్యఎదర
MM - మ. మ. - మధ్యమధ్య
MB - మ. వె. - మధ్యవెనక

# వసంతసేన

## రంగం-1

[ చారుదత్తుని ఇల్లూ, దాని ఎదటి భాగమూ. MF నించి LB కేసి అడ్డు ఉండాలి, దానికి ద్వారం ఉండాలి! ఎడమభాగం (ఇల్లు) గుడ్డివెలుగు. కుడిభాగం (వీధి) కారు చీకటి. ]

మై—(RF నించి చీకటి భాగం ఎదరకి వచ్చి) ఔరా! అంతా బొత్తిగా అంధకారం అయిపోయిందిగదా! మహనీయుడైన మా చారుదత్తుడి ఐశ్వర్యం గతించిన తర వాత, అతని ప్రియస్నేహితుణ్ణైన నా బ్రతుకు వీధిని పడి పోయింది. ప్రస్తుతం నేను బ్రాహ్మణార్థాలకి వెళ్ళి తినవలి సొచ్చింది. కానీ, స్నేహం స్నేహమేకదా...(ద్వారంలోంచి ఎడమభాగం ఎదరకొచ్చి, చేతులో ఉన్న ఉత్తరీయం వాసన చూస్తూ) జాజిపువ్వుల వాసన! ఈ ఉత్తరీయం, మిత్రుడు జూర్ణవృద్ధుడు చారుదత్తుడి కిమ్మని నాచేతి కిచ్చాడు, ఇతడు పోనీ వేసుగుంటాడని. (LM కేసి చూసి) దేవతాపూజ కానిచ్చుగుని గావును చారుదత్తుడు ఇల్లా వస్తున్నాడు.

చా—(LM నించి వచ్చి కూర్చుంటూ) ఇడుగో! సర్వకాల మిత్రుడు!

మై—మరే. కుశలమా?

చా—ఆ. కూర్చో.

మై—అల్లానే. ఇదిగో మనమిత్రుడు చూర్ణవృద్ధుడు నీకిమ్మని ఇచ్చాడు. (అని ఉత్తరీయం ఇస్తాడు)

చా—(ఉత్తరీయం పుచ్చుకుని బాధపడుతూ) నా కా! చూర్ణవృద్ధుడు నన్నుగురించి ఎంత శ్రమపడ్డాడో!

మై—ఇంతమాత్రానికే బాధపడతా వేమయ్యా! మంచి ఉత్తరీయం, హృదయపూర్వకంగా ఇచ్చాడు. వేసుగో.

చా—కష్టపడి సుఖపడచ్చుగాని, సుఖపడి కష్టపడడం దుర్భరం.

మై—నిజమే. ఒక్కొక్కప్పుడు అంతకంటె మరణం నయం అనిపిస్తుంది కూడానూ.

చా—అనిపించడమే, కాదు. యథార్థంగా మరణమే నయం. మరణబాధ క్షణమాత్రమే, దారిద్ర్యబాధ యావజ్జన్మబాధ.

మై—మిత్రమా! నీది దారిద్ర్యం అనుకోడమూ తప్పే, నువ్వు బాధపడడమూ తప్పే. ఐశ్వర్యం యావత్తూ ఇంకోళ్ళు వృద్ధిపొందడానికి ఇచ్చేసి క్షీణించిన మానవ చంద్రుడవు కావుటోయ్ నువ్వూ!

చా—నాబాధ నా దారిద్ర్యంగురించికాదు. మునపటిలోలాగ అతిథులు నాయింటికిప్పుడు వస్తూండడం జరగదుగదా, అని.

మై—మిత్రమా! ఋద్ధున్నేగాని సంపదలు ఆశ్ర యించవు. సంపద లున్నప్పుడేగాని అర్థులు ఎవర్నీ ఆశ్ర యించరు.

చా—మైత్రేయా! ఈ గొడవలకేం పోదూ! గృహ దేవతలకి బలి ఇచ్చాను. ఆ బలి అర్పించిరా.

మై—నేను వెళ్ళను.

చా—అదేమీ?

మై—ఏమా, ఇంత దురవస్థలో ఉండీకుడా నువ్వు బలి సమర్పిస్తూంటే, ఆ దేవతలకి అనుగ్రహం అంటూ లేదుగనక.

చా—అట్లా అనకూడదు. ఇది మన విధిగదా!

మై—స్నేహితుడా, అయినాసరే, ఈ పనిమీద మరొకర్ని పంపు. ఎందుకంటావా, నేను ఏపని చెయ్య దల్చినా కుడి ఎడమా ఎడమ కుడీ అవుతోంది — అద్దంలో లాగ. మరో చిక్కేమి టంటే, వీధులంట వేశ్యకాంతల కోసం విటులు బయల్దేరతారు—రాబోయే వానకి రెక్కల పురుగుల్లాగ. అడ్డువచ్చినవాళ్ళని వాళ్ళు చంపేస్తారు. అటు వంటప్పుడు నువ్విక్కడ కూర్చుని నాకు సాయం ఎల్లా కాగలవ్?

చా—సరే. కూర్చో. కొంచెం ధ్యానం చేసు గుంటాను. (అని LM కి పోతాడు. మైత్రేయుడు LF నడుస్తాడు)

(RM నించి "వసంతసేనా, నిలు నిలు" అనే కేకలు వినిపిస్తాయి).

శకా—(RM నించి చీకటిలోకి వచ్చి) వసంతసేనా నిలు నిలు, ఓసి నిలవ్వే!

విటు—(వెనకాలే వస్తా) వసంతసేనా, పరిగెత్తకు, నిలు నిలు!

శ—ఆస్టే నాట్యం చెయ్యకుమరీ!

వి—ఆగుమరీ!

శ—పుష్పబాణాలవాడు నన్ను ఈ చీకట్లో కాల్చేస్తున్నాడే, కాంతా!

వి—మేం గాలినికూడా తరిమి పట్టగలం, ఆగు. లాభంలేదు.

శ—బావా, విటుడుబావా! ఈ భోగస్త్రీలని వర్ణించే నిమిత్తం పది పేర్లు తయారు చెయించాను—కొత్తరకం దశావతారి! అవి విన్నావా? వింటావా?

వి—మూర్ఖాగ్రేసర శకారబావో, ఇప్పుడుకాదు.

శ—ఇప్పుడే. 1. మదనబాణం 2. ఆటకత్తి 3. నర హారి 4. నగలపుట్ట 5. పసిడిరోగం — 6. లయాలయం 7. మెరుగుటద్దం 8. ఒలుగుజలగ 9. టక్కరినక్క 10. మోక్షరంగం.

వి—మూర్ఖుడా, ఇదికాదురా సమయం, సౌందర్య వర్ణనకి!

వసం—(R B నించి ప్రవేశించి) ఓ పల్లవకా పల్లవకా! ఓసీ పరభృతికా పరభృతికా!

శ—బావా, అదుగో మనిషికంఠం!

వి—భయం లేదు లే.

వసం—ఓసీ, పరభృతికా!

శ—బాబోయ్, అదేమిటి బావా! నన్నేనా?

వి—కాదు. తన దాసీజనాన్ని పిల్చుకుంటోంది.

శ—ఆడవాళ్ళనేనా?

వి—అవును.

శ—ఆడవాళ్ళయితే, సరే. వందమందినైనా సరే, చంపేస్తా, విడివిడిగా వస్తే!

వి—అవును, నీ స్త్రీసాహసం అద్వితీయం.

శ—ఓసీ వసంతసేనా! నువ్వు పల్లవాన్ని కాదు, పరభృతాన్ని కాదు, మధుకరిని కాదు వసంతపు సేనని అంతనీ వెతుక్కున్నా సరే, ఏమీ లాభం లేదు. తరిమేది నేను. అందులోనూ నేను మనిషిని. నిన్నెవరు రక్షించగలరు? కోపం రేగితే నిన్ను తెగనరుకుతాను. అప్పుడు ఏకుంతీ కడుపునపుట్టిన రావణాసురుడు వచ్చి అడ్డుపడగలడూ?

వసం—అయ్యో! అబలని.

వి—అందుకే రక్షించాం.

శ—అందుకే కొద్దిగానైనా చంపెయ్యలేదు. బావా! ఈ పువ్వుల ఘుమఘుమ నాకేనా కొడుతూంటూ!

వి—మరే.

వసం—ఆర్యా! మీకు నానగలు కావాలా ఏమిటి?

వి—హరహర! ఎంతమాటా! మాకు నగ లక్కర్లేదు.

వసం—మరి ఏమిటి?

శ—ఏమిటా! చెబుతావిను. నేను నరమానవుణ్ణి గనక నన్ను నువ్వు మోహించాలి. తెలిసిందా?

వసం—చాలు. సిగ్గుచేటు. తుంటరి ప్రశంస చెయ్యకు.

శ—(నవ్వి) బాపోయ్! అది—నాతో—ప్రశంస చేస్తుందిట! అంటే—సంసారం చేస్తుందిట!

వి—వసంతసేనా! నువ్విప్పు డన్నమాట వారకాంత నోటంట రావలిసింది కాదు.

వసం—యోగ్యతనుబట్టి ఉంటుందిగాని అనురాగం, దండించడాన్నిబట్టి ఉండదు.

శ—సరేకాని, బాపోయ్! ఇది మొన్న కామదేవాలయంలో ఆ దరిద్ర చారుదత్తుణ్ణి చూసిన దగ్గిర్నించీ వాణ్ణి మోహించింది. ఆ దిక్కుమాలాడియిల్లు ఈ ఎడం పక్క ఉంది. ఇది ఆయింట్లోదూరి దాక్కోకుండా చూడాలి.

వి—సెబాస్ కాణేలీపుత్రా! చారుదత్తుడి యిల్లు ఈ ఎడమపక్క నేనా ఉంటా! ఆహా! ఏమి నీ తెలివి, చీకట్లోకుడా!

శ—అవును. ఈ ఎడమపక్కనే ఉంది. చారుదత్తుడి ఇల్లు !

వి—చాలా అంధకారంగా ఉంది కదూ.

శ—కొంత చల్లగాకూడా ఉంది.

వి—కళ్ళు మూసుకున్నా తెరిచినా ఒకటేలా ఉన్నాయి, గుడ్డికళ్ళలాగ.

శ—అరెరెరె. బావా, బావా! ఏదీ వసంతసేనా? నేను వెతుకుతానుండు...చీకటికోణంలో మసి ఉండలాగ మాయంఅయిందే, ఇదీ!

వి—పోనీ, దాన్ని చీకట్లో పోల్చుకోడానికి గుర్తులు నీకు తెలుసా?

శ—తెలుసునుగాని, పోనీ అవేమిటో విడివిడిగా చెప్పు, వింటాం!

వి—పువ్వుల పరిమళమూ, నగల చప్పుడూనూ. గ్రహించుకో! వసంతసేనా! లాభంలేదులే. నీ పువ్వుల వాసనబట్టీ నీ నగలచప్పుడుబట్టీ చీకట్లోనైనా నిన్ను మేం పట్టుకోగలంలే! ముందు ఈసంగతి గమనించు వసంత సేనా!

శ—నాకు ఈ కుడివేపునించి పువ్వుల 'చప్పుడు' వినిపిస్తోంది. నే నిటుపోయి వెతుకుతాను.

వి—సరే, కానీ (అని అటే వెడతాడు.)

వసం—(రెక్కల తలుపుదగ్గిర చీకట్లో నిలబడుతుంది.)

చా—(L M నించి వచ్చి) మైత్రేయా!

మై—(L F నించి కళ్ళు నులుముకుంటూ వచ్చి) ఓయ్!

చా—బలిమూట తీసుకు వెళ్ళు.

మై—అబ్బ! నేను వెళ్ళను (అని ఆవలించి కళ్ళు మూసుకుంటాడు.)

చా—ఔర, దారిద్ర్య మహిమ! మైత్రేయుడు కూడా నామాట వినిపించుకోడే!...నిజమేనా, మైత్రేయా, వెళ్ళవా?

మై—(ఉలిక్కిపడి తెలివి తెచ్చుకుని) అపరాధం, అపరాధం, మిత్రమా! ఊరికేఅన్నాను. నీమాట నాకు వేదం. రదనికనికూడా నాతో పంపించు.

చా—రదనికా!

ర—(L B నించి వచ్చి) అయ్యా!

చా—మైత్రేయుడితో నువ్వు కూడా వెళ్ళు.

ర—చిత్తం.

మై—ఒసేవ్, నువ్వు దీపంపట్టూ. నేను తలుపు గడియతీస్తాను! (అని తలుపు తీస్తాడు.) ఇదేటయ్యా బలిమూటా! (అని బలిమూట పుచ్చుకుని) నడవ్వే!

ర—(దీపంతో ద్వారం దాటబోతూంటే వసంత సేన తనకొంగుతో దీపం ఆర్పేసి, ఇంట్లోకెళ్ళి దాక్కుంటుంది.)

చా—మైత్రేయా, అది ఏమిటి ?

మై—ఏముంది, తలుపులు భార్లా తీసేసరికి గాలికి దీపం కొండెక్కింది.

చా—నేను లోపలికి పోతాను. దీపం మళ్ళా వెలిగించు (అని L M కి వెడతాడు.)

శ—బావా, నేను వసంతసేనని వెతుకుతున్నా, ఆఆ దొరికింది, దొరికింది...ఇదుగో (అని విటుణ్ణి పట్టుకుంటాడు.)

వి—ఓరి శుంఠా, నన్నురా నువ్వు పట్టుగుంటా !

శ—ఓరి నువ్వా ! సరి. నువ్వు ఇక్కడుండు. ఇక్కడంటే ఇక్కడే, కదలకు. మళ్ళీ వెతుకుతాను. వెతికాను, వెతికాను. దొరికింది. ఆః ఆః ఆః...దొరికింది. పట్టు. ఇదుగో పెద్దతలకట్టు! (అని రదనికని పట్టుగుంటాడు.)

ర—ఎవరండీ నాజుట్టు ఇల్లా లాగుతున్నారూ ? గొప్పవాళ్ళు ఇల్లాంటిపని చెయ్యొచ్చునాండీ !

శ—(నవ్వి) బావా ! ఇది కంఠం ఎల్లా మార్చేసిందో చూడు !

వి—కంఠం మార్చిందా, నువ్వు తలకాయి మార్చావా ? చిత్రమే.

శ—చిత్రమేగాని, ఎవరో మనుషులు.

మై—(దీపంతో వచ్చి) ఇది పెద్దమనిషి లక్షణం కాదు. చారుదత్తుడికి ధనం పోయినంతమాత్రాన్ని పరాయి

కీచకులు ఇంటి యెదటికొచ్చి చందనాలు తొక్కేసే సేనా !

ర—నాకు జరిగిన పరాభవం చూశారా ?

మై—అవమానమే జరిగిందీ ?

ర—అవును.

మై—నిజంగా ?

ర—నిజంగానండీ.

మై—అయితే వాడెవడో చెప్పు, నా కర్రకీ వాడి బుర్ర బలేస్తా.

వి—అయ్యా, క్షమించండీ.

మై—వీడయి ఉండడు. (శకారుణ్ణి చూసి) వీడే ! ఒరే ఖలుడా, ఓరీ తేలూ ! చారుదత్తుడికి ఐశ్వర్యం గతించిన మాత్రాన్ని, అతని యింటికొచ్చి, అతని పరిజనాన్ని అవమానపరుస్తావురా ?

వి—మహాబ్రాహ్మణా ! సహించండీ. ఇది పొరపాట్న జరిగింది. మేం ఒకస్త్రీని వెతుకుతున్నాం. విరాడనమ్మండి. (అని కత్తిపారేసి కాళ్ళకి మొక్కుతాడు.)

మై—నువ్వు మంచివాడవుగాపును, లే, లే. ఎరక్క అన్నాను. క్షమించు. లే.

వి—ఒక్క విషయంలో అభయం ఇస్తేగాని లేవను.

మై—(లేచి) చెప్పు.

వి—ఈ గొడవ చారుదత్తుడికి తెలియ నియ్యకూడదు.

మై—తెలియనివ్వను. ఛే.

వి—(లేస్తాడు)

శ—బావా! నువ్వెళ్ళి వాడి కాళ్ళమీద ఎందుకూ పడ్డావు?

వి—భయపడి.

శ—ఎవరంటే?

వి—చారుదత్తుడి సుగుణాలంటే!

శ—తిండికి పిండంలేనివాడికి సుగుణాలేమిటీ?

వి—అతడు ఇతరుల్ని పోషించి తను దరిద్రుడైనాడు.

శ—అటువంటి దరిద్రపు సన్నాసి ఎవడోయ్?

వి—మళ్ళీ మొదటికొస్తావేమిరా మూర్ఖా! ఆర్య చారుదత్తుడురా, ప్రజ్ఞావంతుడు, దీనకల్పద్రుమం, త్యాగమూర్తి! మరి పోదాం, రా.

శ—మరి అదో!

వి—అదీలేదు, ఎదీలేదు.

శ—ఎంచేత లేదూ?

వి—నీ గ్రహచారం.

శ—వసంతసేన లేందే, నేరాను.

వి—అట్లాయితే, నేపోతాను. (అని R F కి నిష్క్రమిస్తాడు).

శ—ఒరీ, బ్రహ్మచారీ, కూచోరా!

మై—కూలబడే ఉన్నాం.

శ—అయితే, నిలబడు.

మై—నిలబడడం మరెప్పుడో!

శ—అయితే ఏడవరా

మై—ఏడుస్తూనే ఉన్నాం.

శ—అయితే నవ్వరా, శనీ

మై—అంతమాత్రం రాదు!

శ—సరే. మరివాక్క. నువ్వు ఆ దరిద్రుడితో ఇల్లా చెప్పు: కామదేవాలయపు తోటలో నిన్ను చూసి మోహించిన భోగం అమ్మాయి, మేం బలాత్కారం చెయ్యగా, నీయింటో దూరింది. దాన్ని తీసుగొచ్చి నా కప్పగించు: నిన్ను మెచ్చుతాను. లేకపోతే, వ్యవహారం ముదురుతుంది, నిరోగం కుదురుతుంద — అని. ఇల్లానే చెప్పు.

మై—తప్పకుండా చెబుతాను. (అని కర్ర నేలమీద కొడతాడు)

శ—(వెనిరి RM నించి RF కి నడిచి పారిపోతాడు).

చా—రదనికా! ఈ ఉత్తరీయం పట్టిగెళ్ళి కుర్రవాడికి కప్పు, గాలిలో పడుకున్నాడు. (అని ఉత్తరీయం అందిస్తాడు)

వసం—(ఉత్తరీయం పుచ్చుగుంటుంది)

చా—రదనికా! మాట్లాడవేం?

మై—(లోపలికి వస్తూ) లోపల లేదమ్మా, రదనిక సిధ్దవాకిట్లో ఉంది.

చా—అయితే, ఈవిడ ఎవరూ? అపరాధం జరిగిందే! పరకళత్రం కాబోలు. ఈ ఉత్తరీయంతో ఈవిడ దేహాన్ని కప్పేశానే!

మై—(చూసి) ఓహో, నువ్వా! ఆ శనిగాడు సరిగ్గానే ఊహించాడు. ఈవిడ, పరకళత్రం కాదయ్యా! కామదేవాలయపు తోటలో నిన్ను చూచ్చంలోనే మన్నించడం ప్రారంభించిన వసంతసేన.

చా—ఓహో, ఈవిడ వసంతసేనా! చాలా అంతఃకరణగల వ్యక్తి.

మై—సరేగానండీ, ఆ శకారుడూ, - రాజుగారుంచుకున్నావిడ తమ్ముడూ, మీతో చెప్పమన్నాడు!...

చా—ఏమని?

మై—కామదేవాలయపు తోటలో నిన్ను చూసి మోహించిన భోగం అమ్మాయి, మేం బలాత్కారం చెయ్యగా, నీయింట్లో దూరింది. దాన్ని తీసుగొచ్చి నాకప్పగించు, నిన్ను మెచ్చుతాను. లేకపోతే, వ్యవహారం ముదురుతుంది, నీరోగం కుదురుతుంది, - అని.

చా—వాడిమాటలకేం లేస్తూ, వాడు ఓ వాగుడుకాయీ! పూజ్యురాలా, వసంతసేనా! నువ్వని ఎరక్క దాసీకి చెప్పవలిసినపని నీకు చెప్పినందుకు, నన్ను క్షమించు.

వసం—ఈ రీతిగా నేను వీధికెక్కినందుకు మీరు నన్ను క్షమించండి...ఆర్యపుత్రా! ఒక ప్రార్థన చేసుగో

వాలని, నే, వచ్చాను. (చేతులు చూపిస్తూ) ఈనగ మీావద్ద దాచిపెట్టాలి. ఇది నా దగ్గిరుంటే దుష్టులు వెంటపడు తున్నారు. ఇదుగో. సువర్ణభాండం ఉంచండి.

చా—సువర్ణం దాచడానికి నా ఇల్లా గట్టి-చోటు ?

వసం—రక్షించేది శీలమేగాని ఇంటి గట్టికాదు గదండీ.

చా—(ఏమీా అనలేక) మైత్రేయా, పుచ్చుకో, ఆ నగ.

వసం—అదీ దయ. (అని, మైత్రేయుడికి నగ ఇస్తుంది.)

మై—(నగ పుచ్చుకుని) శ్రీకృష్ణార్పణం !

చా—అయ్యో మూర్ఖుడా! ఆవిడ దాచిపెట్టమని ఇస్తోందిగాని, దానం చెయ్యలేదోయ్ !

మై—ఓహో, అల్లానా! ఇంకా ఏమిటో అనుకున్నానే. అయితే...ఒకవేళా...ఏ దిక్కుమాలి దొంగా డైనా...కన్నంతవ్వి...ఇది—ఎత్తుకుపోతే...

చా—అదా! భయంలేదు. మళ్ళీ త్వరలోనే వెనక్కి ఇచ్చేద్దాం. రాత్రెళ్ళప్పుడు నీదగ్గిరే ఉణ్ణే.

వసం—అయ్యా! నేనింటికి పోతాను. మీాస్నేహితుణ్ణి కాస్త తోడు పంపించండి.

చా—మైత్రేయా! ఆవిడకి సాయంవెళ్ళి సాగనంపి, రా.

మై—మన్వాళ్ళమంటే వెళ్ళినా ఏమిటిగాని, రాజహంసితో కూడా వెళ్ళవలసింది రాజహంసా వెనకాలే బొంతకాకా! నలుగురూ నవ్వుతారు కూడాను.

చా—సరే, నేనే వెళ్తాను. రా, వసంతసేనా!
(అని, R F కి మొదట చారుదత్తుడు నడుస్తాడు. వెనకాలే, వసంతసేన వెళుతుంది.)

మై—ఔరా! ఇది విచిత్రమైన సమాగమనం! రదనికా, రా! వసంతసేన వచ్చేసరికి మా మిత్రుడు ఈ బలిమాటే మరిచిపోయాడు. పదం, ఈపని మనం చక్కబెట్టివద్దాం.

(అని R M కి వెళ్ళడానికి ప్రయత్నం చేస్తూన్నట్టు వాళ్ళు కనిపిస్తూండగా, తెర.)

—*—

రంగం-2

(C 2 ఎదట)

[R F నించి సంవాహకుడు కంగారుగా
రొజుతూ వచ్చి]

సం—అబ్బబ్బ! ఎంత హైరాన పడుతోంది రా, ప్రాణి! (నెత్తి బాదుకుంటూ) వచ్చేనాపోయావు కావురా, సంవాహకా! ఈ జూదం ఆడ్డం అంత దిక్కుమాలిపని ఇదే గాని మరొకటి లేదు. పందెం కాసి ఓడిపోయి పది సువర్ణాలు బాకీపడ్డాను. పద్దులు రాసే మాథురుడూ నెగ్గినవాడూ నన్ను పట్టుగుని, బాకీ కక్కాలని నిర్బంధించారు. వాళ్ళని తప్పించుగుని పరిగెట్టుగుని వచ్చేసరికి ప్రాణం చాలొచ్చింది...అమ్మయ్య! వాళ్ళని దగా చెయ్యడానికి ఎంత ప్రజ్ఞ కావలిసొచ్చిందో కదా! పక్కని ఒక పాడుదేవాలయం ఉంటే, వాళ్ళకి తెలియకుండా వాళ్ళు పోల్చుగోడానికి వీల్లేకుండా వెనకనడక నడిచి అందులోదూరి, అమ్మవారు ఉండేచోట బిర్రబిగిసిపోయి కొయ్యలాగ చీకట్లో కూచున్నాను. అయితేం, తమర్ని దగా చేసేటందుకు నేనే వెనకనడక నడిచి ఉంటానని వాళ్ళకి అనుమానం తట్టి వాళ్ళు లోపలికివచ్చి తణిఖీచేశారు. కాని, ఒకడు అమ్మవారు రాతిదంటే రొండోవాడు కర్రదంటూ వాళ్ళు పట్టింపులుబోయి నన్ను వదిలేశారు. వదిలేసినవాళ్ళు పోయారా! అబ్బే! ఆ పాడుగుడి

ముసకే ఇద్దరూ ఆడడానికి కూచున్నారు. నిమిషంలో వా ళ్ళిద్దరికీ చెడింది, తగాదావచ్చింది—నాదెపందెం అంటే నాది పందెం—అని. అప్పుడు, నేను, నా కర్మంచేత దాక్కున్న సంగతి మరిచేపోయి. నేనూ ఆడుతూన్నట్టే భ్రమపడి, ఆవేశంపుట్టి, ఒళ్ళు తెలియక, 'పందెం మీ యిద్దరిదీ కాదు. నాదిరోయ్' అని కేకేస్తూ వాళ్ళమధ్యకి వెళ్ళిపడ్డాను. వాళ్ళు నన్నిసారి గట్టిగా పట్టుగుని మెత్తగాతన్ని పది సువ స్తాలూ తెమ్మన్నారు. ఆగమంటే ఆగరు, ఎల్లాతేనంటే, వినిపించుగోరు. అక్కడికీ స్నేహితుడు దద్దరకుడు వచ్చి అడ్డుపడ్డాడు. వాడో దరిద్రుడు. ఎంజెయ్యగలడూ ! కొంచెం సేపు డబాయించి, చివరికి మాథురుడి కంటో ఇంతదుమ్ము చల్లి పారిపోయాను. మాథురుడూ నెగ్గినవాడూ మళ్ళీ నాకోసం వెతుకుతూనే ఉంటారు. నేనూ ఎక్కడేనా జాగ ర్తగా దాక్కోవాలి. ఎవరికాళ్ళమీదేనా పడాలి. ఏదో దారితియ్యాలి, ఇల్లా వెళదాం. (అని L F కి వెడతాడు.)

[రెండో తెర లేవగా, R M నించి
సంవాహకుడు వస్తాడు]

సం—ఎవరిదోగదా, ఈ గృహం ! అయ్యా, శరణు శరణు !

వసం—భయంలేదు, భయంలేదు.

సం—అమ్మా, శరణు.

వసం—(L M నించి వస్తూ) భయం లేదు. ఏమిటి వచ్చొచ్చిన చిక్కు ? మదనికా !

మ—(L M నించి వస్తుంది.)

వసం—వీధి తలుపు గడియ వేసి, రా.

సం—అప్పులవాళ్ళు, తల్లీ !

వసం—ఓస్ ! ఇంతేకదా ! అయితే భయం అసలే లేదు. మదనికా, తలుపు తెరిచేఉండనీ.

సం—వాళ్ళు నా వెనకాలే వచ్చిపడతారమ్మా !

(R F దగ్గిర కేకలు వినిపిస్తాయి. సంవాహకుడు భయపడతాడు. వసంతసేన సంజ్ఞ చెయ్యగా, మదనిక వెళ్ళి R F దగ్గిర నుంచుంటుంది.)

వసం—అయ్యా, మీరెవరు ?

సం—అమ్మా, నన్ను సంవాహకుడు అంటారు.

వసం—మీ వృత్తి ?

సం—శవ వహనం. ఏమోతల్లీ ! చచ్చిపోయిన వాళ్ళవల్లే బతుకుతున్నాను, ఇటీవల.

వసం—వెనక ?

సం—వెనక ఒక మహానుభావుడికి సేవకుణ్ణి. నా యజమాని తన సంపద అర్థులకి ధారపోసిన సార్థకత్యాగి, సుగుణమూర్తి.

వసం—వారి పేరు ?

సం—అమ్మా, ఆయన పేరు చారుదత్తుడు.

వసం—(చటుక్కున లేచి నమస్కరించి) అయ్యా! ఈయిల్లు తమదే అనుకోండి. మదనికా, పీట తెచ్చి, వేసి, విసురు. విసనకర్ర తే. ఈయన చాలా డస్సిపోయి ఉన్నారు.

సం—అమ్మా! నాకు పరిచర్యవద్దు. తమరు కూర్చుండండి. నేను నా యజమానికి పాదాలు ఒత్తుతూండేవాణ్ణి. ఆయనకి దారిద్ర్యం పట్టగానే, నాకు జూదం అలవాటైంది. పందెంకాసి, ఓడి, పది సువర్ణాలు బాకీపడి పారిపోయి వచ్చాను.

(R F దగ్గిర - ఒరేయ్, ఈ యింట్లోకి వెళ్ళాడురా— అని వినిపిస్తుంది).

సం—అమ్మా! వాళ్ళకే నేను బాకీ!

వసం—మదనికా! (అని చేతి మురుగులజత తీసి) ఈ మురుగులు ఆ సభికులకి ఇచ్చిరా!

మ—(మురుగులు తీసుకుని, వెళ్ళి, మళ్ళీ అప్పుడే వచ్చి) అమ్మా! అవి పుచ్చుగుని వాళ్ళు సంతోషిస్తూ వెళ్ళారు.

వసం—అయ్యా! ఇంక మీరు మీ యిష్టప్రకారం వెళ్ళవచ్చు.

సం—అమ్మా! ఇంత కారుణ్యం నామీద వహించి, బంగారాన్ని మట్టిలాగ విసర్జించి, మీరు నన్ను రక్షించడంలోనే నన్ను శిక్షించడంకూడా నెరవేరిపోయింది. ఈశిక్ష నాజన్మకి చాలు తల్లీ! నేను వెంటనే సన్యాసి నవుతాను. మీ పాదాలకి నమస్కారం.

వసం—అంత మరీ సాహసం చెయ్యకండి, నిదానించండి.

సం—నిదానించవలిసిన అవసరం మరి లేదండి, నా నిశ్చితం అయిపోయింది. సెలవివ్వండి. నా నిశ్చితం సంగతి మరవకండి. (అని గబగబా R M కి వెళ్ళిపోతాడు).

(R M నించి పెద్ద కోలాహలం వినబడుతుంది)

వసం—మదనికా !

మ—అమ్మా !

వసం—ఆ కోలాహలం ఏమిటో చూసిరా.

మ—(R M కి వెళ్ళి అప్పుడే వచ్చి) అమ్మా ! మన ఏనుగు కట్టు తెంపుగుని ఎగబడిందట.

వసం—అరె, చూసిరా చూసిరా.

మ—(వెళ్ళివచ్చి) అమ్మా, దారుణం దారుణం. ఏనుగు మన మావటివాణ్ణి తొండంతో చుట్టి పైకి గిరవ వేసింది. వాడు బంతిలా దొర్లి దూరంగా పడ్డాడు.

వసం—అయ్యో ! (అని మెల్లిగా లేస్తుంది)

మ—(మళ్ళీ వెళ్ళివచ్చి) జనం గందరగోళంగా పరిగెత్తుతున్నారు. ఏనుగు వీథుల్లో చెలరేగుతోంది. (మళ్ళీ చూసి క్షణంలో వచ్చి) అమ్మా అమ్మా! ఇక్కణ్ణించి వెళ్ళిన ఆయన దాని కెదురుగుండా నడిచి వెడుతున్నాడు. (ఇంకో సారి వెళ్ళివచ్చి) ఘోరం ఘోరం. ఆయన ఏనుగు దంతాల మధ్య చిక్కుకున్నాడు.

వసం—అయ్యొయ్యో! (అని తన మొహం చేతుల్తో కప్పుగుంటుంది).

మ—(RM దగ్గర నుంచుని) అమ్మా! అడుగో మన శౌఖరు, కర్ణపూరకుడు. ఆఁ ఆఁ...ఇనపకోలతో ఏనుగుని పొడిచాడు. ఆఁ. ఇక్కడినించి వెళ్ళిన ఆయన బతికాడు, పాపం!

వసం—బతికాడుగద! సంతోషం. ఆయనది పునర్జన్మే!

మ—కర్ణపూరకుడు పరిగెట్టుకుంటూ ఇల్లా వస్తున్నాడు.

వసం—ఏనుగు ఏమైంది?

మ—స్వాధీనమైంది.

వసం—కర్ణపూరకుడు చాలా మంచిపని చేశాడు.

మ—మీరు పెట్టేఅన్నం అటువంటిది. అతణ్ణి జనం అందరూ మెచ్చుగుంటున్నారు, తల్లీ. ఒక పుణ్యాత్ముడు... తనుకూడా ఎదేన్నా బహుమతీ ఇయ్యడానికి తనచేతి మడికట్లూ వేళ్ళూ నిమిరి చూసుగుని, ఏమీ కనపడకపోగా, ఒక ఉత్తరీయం అతడిమీద గిరవటేశాడు.

వసం—అహా! ఎవరోగదా, ఆ దివ్యపురుషుడు!

మ—అడుగో, కర్ణపూరకుడు పిలుస్తున్నాడు. వెళ్ళి ఇప్పుడే వస్తానుండండి, అమ్మగారు! (RMకి నిష్క్రమిస్తుంది).

వసం—(తనలో) ఆ మహానుభావుడు ఆర్య చారుదత్తుడే అయిఉంటాడు. సర్వమూ పోగొట్టుగుని ఉండకమూ,

స్నేహితుడు తనకి ఉత్తరీయం దానంచేసి ఉండడమూ, ఆ ఒక్క ఉత్తరీయమూ అన్య ప్రాణరక్షణచేసిన వ్యక్తికి తాను - అంతకంటె లేకపోయెనే అని బాధపడుతూ- ఇచ్చి వెయ్యడమూ గమనిస్తే, ఆయన విధాయకంగా చారుదత్తుడే! ఔరా! ఆ ఉత్తరీయంయొక్క జాజిపువ్వుల సువాసన ఆయన సుగుణాల సౌరభంతోకూడి ఎన్ని రెట్లయిందో ఈపాటికి!

మ—(R M నించి వస్తూ) అమ్మా అమ్మా!

వసం—ఏమిటి? ఏడీ కర్ణపూరకుడు?

మ—ఏనుగుని శాలలో కట్టేసి వస్తాడట.

వసం—అదేమిటి?

మ—ఎవరో మహానుభావుడు అతడికి ఈ ఉత్తరీయం బహుమతిగా ఇచ్చాడట.

వసం—నువ్వు లాక్కున్నావెందు కిదీ?

మ—అతడు ఉణ్ణేమన్నాడు.

వసం—ఎందుకోసం?

మ—ఏమో, నేను అడగలేదు తల్లీ. బహుశా...

వసం—ఏమిటి బహుశా...

మ—అతడి ఒళ్ళంతా బాడైంది. స్నానంచేసుగుని, దుస్తులు మార్చుగునివచ్చి మీకు కనపడతాడు గావును, అందాకా నన్నిది పట్టుగోమని అతడి ఊహ అయి ఉంటుంది.

వసం—అయిఉంటాడె. నిజమే. ఏది చూడీ! అది యిల్లాతే! (అని ఉత్తరీయం పుచ్చుకుని, కళ్ళకి అద్దుకుని) మదనికా! కర్ణపూరకుడు ఎంత గొప్పపని చేశాడే! ఎంత గొప్పకానుక సంపాదించాడే! ఎంత అదృష్టవంతుడే! వాడికి (తనమెళ్ళో హారం ఒకటి తీస్తూ) ఈహారం నా బహుమతీగా ఇచ్చిరా, ఇంతపని చేసినందుకు!

మ—(హారం తీసుకుని) చిత్తం. (అని RM కి వెళు తుంది).

వసం—(మదనిక వెళ్ళినవేపు నిదానంగా చూస్తూ, దృష్టి మెల్లిగా తన చేతులోఉన్న ఉత్తరీయం మీదికి తిప్పి, కళ్ళుమూసుకుని, ఉత్తరీయం అదిమిపట్టుకుని, తలవంచి దాని సువాసన ఆఘ్రాణిస్తూ నిలబడి ఉండగా, తెర.)

రంగం-౩

(మొదటి రంగంయొక్క దృశ్యం. R B నించి M F కి అడ్డం, దానికి ద్వారం. కుడివైపు చీకటి. ఎడమవైపు చిన్న వెలుగు. చారుదత్తుడు మధ్యకేసి, మైత్రేయుడు ఎదరకేసీ పడుకుని ఉంటాడు. మైత్రేయుడు గుర్రు. నిద్దట్లో మాటలు. సువర్ణభాండం మూట చేత్తోపట్టుగుని, ఈ చేతినించి ఆ చేతికీ చంకలోకీ మారుస్తూ, దాన్నిగురించి నిద్దట్లో కుడా తాప త్రయం కనపరుస్తాడు.)

మై—(పలవరింతల్లో) దిక్కుమాలిచెర, ఈ సువర్ణ భాండం ఓటిపోగైంది నాకు. ఇది పోయినా వొదిలిపోను, ఆరోగ్యంగా పడుకునేవాణ్ణి బతుకుజీవుడాఅని. ఇంతఊరుండి, దిక్కుమాలిఊరు. ఇది తస్కరించేపాటి దొంగాడేనా లేడాయిరి ఇంతాచేస్తే!

[శర్విలకుడు R B నించి నల్లని వేషంతో, మొగం గుర్తు తెలియకుండా, చీకటిలో ప్రవేశించి, ఎదరకివచ్చి]

శ—ఆహా! ఇప్పటికి సొరంగం తవ్వి ఆవరణలోకి వచ్చాను. ఇక కన్నంతవ్వి ఇంట్లో ప్రవేశించాలి. తెగిస్తాను. అస్తమించిన చంద్రుడా నీకు దణ్ణం. ఓ తమోరాశీ నీకు నమోవాకం. తడిగాని చౌడుగాని ఉన్న గోడభాగం ఆ మూల వెతుకుతాను. కుమారస్వామీ, జోహారు! కనకశక్తి బహుపరాకు! యోగాచార్య విద్యాగురూ భాస్కరనందీ, వందనం! (అని వెనక్కి వెళ్ళిపోతాడు.)

మై—(నిద్రలో) మిత్రమా !

(కొంచెం ఆగి) ఇంత బంగసిద్దరేం నీకే ?

(కొంచెం ఆగి) ఈ సువర్ణభాండం నాకు అంటకట్టా వేమయ్యా మహానుభావా !

(కొంచెం ఆగి) బాబ్బాబు ! ఇదుగో ! నామాట వినవూ !

(కొంచెం ఆగి) ఆం రమ్మన్నావు పొమ్మన్న బంతికే. నామాటెక్కడ వింటావ్ !

(కొంచెం ఆగి) నీపాదాలకే దణ్ణం, ఇది నువ్వే పుచ్చుకుందూ !

శర్వి—(L B నించి ఎదరకి వచ్చి) వీపు కొంచెం గీసుకుపోయింది. నా శరీరం పట్టడానికి తగ్గ కన్నం తవ్వే టందుకు కైవారంగా ఉపయోగపడింది నా యజ్ఞోపవీతం. (గది కలియజూచి) ఇద్దరూ! చప్పుడు కాకుండా నిళ్ళచల్లి తలుపులన్నీ తెరిచిఉంచి వచ్చాను...వీళ్ళది అసలు నిద్రా దొంగనిద్రా ? (పరీక్షించి) సరియైన నిద్రే. ఈయిల్లు చాలా దరిద్రంగా ఉందే ? లేక, భయంవల్ల యజమాని ధనం అంతా దాచేశాడేమో !

మై—(నిద్రలో) మిత్రమా ! నామాటవిను. ఎవ డేనా దొంగ కన్నం తవ్వి రావచ్చునయ్యా, ఈ సువర్ణ భాండం నువ్వు త్వరగా పుచ్చుగోవయ్యా, మహారాజా, నన్నొడిపించకయ్యా !

శర్వి—(తల ఇష్టంగా ఊపుతూ పెదిమిమీద వేలెట్టు గుని, శబ్దం లేకుండా మైత్రేయుడిదగ్గరికి వెడతాడు.)

మై—(చెయ్యి చాపి) ఇదుగో! ఈ నగా, నువ్వూ...

శర్వి—(తన చెయ్యి అందిస్తాడు.)

మై—ఆఁ. ఆఁ? ఇదేమిటే, చెయ్యి తడిగా ఉందేం? చెయ్యి చెంపకింద పెట్టుగుని నిద్దరోయావా ఏమిటే!

శర్వి—(చెయ్యి పొడిగా చేసుగుని మళ్ళీ చాచు తాడు.)

మై—(నగ యిస్తూ) ఇదిగనక నువ్వు పుచ్చుగోక పోతే, పెద్ద ఒట్టూ! గోబ్రాహ్మణ హత్యచేసినంత ఒట్టూ. లేకపోతే, గోబ్రాహ్మణహత్య చెయ్యనంత ఒట్టూ!

శర్వి—(నగపుచ్చుగుని, ఇక పడుకోరా అన్నట్టు చెయ్యిఊపి, దీపం ఆర్పి, R F కి వెళ్ళిపోతూ ఆగి) ఇక నెంటనేపోయి మదనికని కలుసుగోవాలి. (అని, వెళ్ళి పోతాడు).

[ L F నించి రదనిక వస్తుంది ]

ర—సావిట్లో దీపం లేదేంచెప్మా. సాలలో వర్ధ మానకుడులేడు. ఈ మైత్రేయుడూ ఏకనిద్దరే. (అని L F కి లోపలి కెళ్ళి దీపం తెచ్చి, తెరిచిఉన్న ద్వారమూ, దానికి అవతలఉన్న కన్నమూ చూడడం నటించి) అమ్మయ్యో! కన్నం! తలుపులన్నీ తీసున్నాయి. మైత్రేయా మైత్రేయా! లే లే. దొంగాడు దొంగాడు. కన్నంతవ్వి వచ్చి, పారి పోయాడు. లే లే.

మై—(లేచి, కళ్ళు మూసుగునే ఉండి) దొంగాడు తవ్వి, కన్నం పారిపోతోందా ?

ర—అబ్బ ! మరే. ఇంకా నిద్దరమైకమే ? చూడు. ఆకన్నం. (అని MB కేసి చూపెడుతుంది)

మై—ఓహో ! నిజమేలాఉంది. మిత్రమా, లేవయ్యోయ్ ! కన్నంవేసి వచ్చి దొంగాడు పారిపోయాడు.

చా—(లేచికూచుని) చాల్లేస్తూ నీ పరిహాసాలూ !

మై—పరిహాస రంగం దాటిందయ్యా స్వామీ, చూడు.

చా—ఎక్కడ ?

మై—గోడకి ఆ చివర.

చా—(అటువెళ్ళి చూసొచ్చి) చాలా గొప్పదే. చూడతగ్గదే. ఇటువంటి కన్నం తవ్వడం, సామాన్యుడివల్ల కాదు.

మై—తవ్వినవాడు, నువ్వన్నట్టు, నేర్పుగలవాడే అయి ఉండవచ్చుగాని, వాడెవడోగాని పొరుగూరి చవట అయి ఉంటాడు. ఈవూళ్ళో మన ప్రస్తుతావస్థ ఎరగనివాడెవడూ !

చా—పాపం, ఈ చోరుడు దురదృష్టవంతుడు. రేపెప్పుడైనా తన స్నేహితుల్తో ఈసంగతి చెప్పవలసొచ్చే సందర్భంలో, వేసివేసి శూన్యగృహానికి కన్నంవేసినట్టు ఇతడు చెప్పుగుని కంటతడి పెట్టుగోవలసొస్తుంది.

మై—నీజాలి బంగారంగానూ, దొంగ వచ్చినాడి గురించి బాధపడతావేమయ్యా! వాడు ఏనగో, ఏనువర్ణ భాండమో - అన్నట్టు మన సువర్ణభాండం జాగ్రత్త చేశావా?

చా—నేనా, నువ్వా?

మై—సరి సరి. నేను నీ చేతి కివ్వలేదూ? నువ్వు పుచ్చుకున్నావ్‌గా!

చా—మిత్రమా, పరిహాసమా?

మై—కాదయ్యా, యథార్థం.

చా—అలాయితే, నువ్వు కలగంటున్నావు. నాకు దానిసంగతే తెలియదు. అది నా కెప్పుడిచ్చావు?

మై—నీ అరిచెయ్యి తడిగా ఉండ లేట్టయ్యా, అప్పుడూ!

చా—నా అరచెయ్యి తడి ఎప్పుడూ? సరి సరి. తెలిసింది. ఒక మంచిమాట తోస్తోంది, విను.

మై—మంచిమాటే! చెప్పు వింటాను.

చా—ఆ చోరుడు సువర్ణభాండం అపహరించాడు.

మై—ఇదా మంచిమాటా?

చా—వాడు కృతార్థుడు అయినాడుగా!

మై—పాడుకర్మం, అది మనది కాదుగా!

చా—ఓహో, మరే.

మై—(కళ్ళు చికిలించి) దొంగ లెత్తుకపోతే నువ్వు మాత్రం ఏంచేస్తావ్? మాట్లాడ కూరుకుందూ కిక్కురుమనీ.

చా—మిత్రమా, మారుకోడం ఎట్లా? చేసే నష్టం భరించాలి. లేకపోతే అప్రతిష్ఠ కాదూ?

మై—ఆఁ, ఎవరిచ్చాడు, ఎవరుచ్చుకున్నాడు, ఎవరు చూడొచ్చాడు, పోనిస్తూ! అదంతా నేను సర్దుకుంటాను, నువ్వు కాస్త గుప్‌చిప్‌గా ఊరుకుంటూ, హరిశ్చంద్రమహారాజువీ!

చా—చాలు చాలు, ఉన్న ఆపన్నకిసాయం, అబద్ధాలుకూడానా!

ర—(తనలో) లోపలికెళ్ళి, ఘూతమ్మగారిని లేపి, సంగతి చెప్పి తీసుకొస్తాను. (అని L F కి వెళుతుంది).

మై—అది అబద్ధం ఎందు కవుతుందండీ! కావలిస్తే తెగేసి చెబుతాను! "మా జాగర్తమీద మేం ఉన్నాం. ఉంటేంగనకా, అన్నింటికీ వచ్చినట్టే సువర్ణభాండానికీ కాలంవచ్చేసింది. ఆ మట్టుగా అంత సువర్ణభాండమూ రెక్కలుకట్టుగుని చూస్తూండగా ఎగిరి చక్కాపోయింది. తప్పునాది. కావల్సిస్తే నన్ను చావగొట్టండి." - అని నే నంటాను.

చా—మిత్రమా, బాధ్యతనాది. నువ్వు చెప్పే ధోరణి అధర్మం.

మై—సరే పోనెండి అల్లాగైతే, అపరాధం; సంగతి చెప్తాను.

ఘూ—(కళ్ళు తుడుచుకుంటూ L F నించి వస్తూ) రదనికా! అయ్యగారికీ మైత్రేయుడికీ కుశలమేకద!

ర—కుశలమే. అదుగో.

ధూ—నాయంత్రం మరిచిపోయాను. మైత్రేయుడు గార్ని ఇల్లారమ్మను.

ర—మైత్రేయా, అమ్మగారి సెలవైంది, రా.

మై—(వచ్చి) అమ్మా, శుభమస్తు. ఏమి సెలవు ?

ధూ—తూర్పు మొహంగా కూర్చోండి.

మై—చిత్తం. (అని వెళ్లబోతూ తూర్పుకి తిరిగి కూచుంటాడు.)

ధూ—(ఒక రత్నావళి యిస్తూ) ఇది గ్రహించండి. (అని దణ్ణం పెడుతుంది.)

మై—(పుచ్చుకుని) వంశాభివృద్ధిరస్తు! అమ్మా! ఏమిటిది ?

ధూ—ఇది పుణ్యదినం. ఈవేళ రత్నషష్ఠి అనే వ్రతం చేసుకున్నాను. సద్బ్రాహ్మడికి సువర్ణ దానం చెయ్యాలి. పగలు మీరు కనిపించారు కారు. రాత్రి మీరొచ్చేసరికి ఆలస్యమైంది. (అని L F కి సమర్పిస్తుంది.)

మై—ఆహా, బోధపడింది. ఏమి యీమె యోగ్యత! మిత్రమా, మిత్రమా. ఇదుగో పుచ్చుకో.

చా—ఏమిటది ?

మై—ఏమిటా! మంచి భార్యని కలిగి ఉండడం యొక్క ఫలం.

చా—కొంచెం విశదంగా చెప్పు.

మై—ఏముందీ! ధూతాదేవిగారు ఏదో వ్రతం చేసుకుంటుదిట. బ్రాహ్మణికి సువర్ణదానం చెయ్యాలిట. నాకు ఈ రత్నావళి దానం చేసింది. నాకంటే నీకే అప్పగాలు.

చా—అల్లాగా! ఆవిడ ఇంకా నిద్రమత్తులోనే ఉందేమో అనుకున్నాను. ఇంత ఆలోచన చేసి, ఇంత త్యాగం చేసిందా! అయ్యో! ఎంత దరిద్రుణ్ణి! కాని, ఎంత ఐశ్వర్యవంతుణ్ణి! సరే, మైత్రేయా, నువ్వు ఈ రత్నావళి తీసుకుని...

మై—మిక్కిలి జాగర్తగా ఉంచేస్తాను.

చా—కాదు. వసంతసేన దగ్గిరికెళ్ళి...

మై—ఇది యిచ్చేసి దణ్ణం పెట్టి రమ్మంటావుగావును.

చా—ఆవిడతో ఇట్లా చెప్పు. "నామిత్రుడు అభ్యాసంచొప్పున జూదం ఆడుతూ, ఆట తమకంలో, సువర్ణ భాండం తనదే అని పొరబడి, పందెంకాసి, అది ఓడి పోయాడూ! అందుకు ప్రతిమూల్యంగా ఈ రత్నావళి పంపించాడు. పుచ్చుకో—" అని.

మై—దొంగా ఎత్తుకుపోయిన సువర్ణభాండం కాస్త దేనయ్యా!

చా—అయితేం లేస్తూ!

మై—అదేనా మనం తిన్నామా ఏడిశామా!

చా—అయితేం లేస్తూ!

మై—అంతోటిదానికే బదిలీగా ఇంత విలవగల రత్నావళి వదులుకోడమే!

చా—మిత్రమా, మరి తర్కించకు. వెళ్ళి యిచ్చిరా. లేకపోతే నన్ను చంపుకున్నట్టే!

మై—(నోరు కొట్టుకుంటూ) అవ్వ, అవ్వ, అల్లాంటి మాటలు అనకయ్యా, మహారాజా! ఓఘాయిత్యం! సంగతి చెప్పాను, అంతే. నీమాటప్రకారం చేస్తాను. తక్షణం వెళ్ళి ఇచ్చేస్తాను. అసలు ఇప్పుడే వెడతాను. నువ్వు నమ్మవేమో బాబూ, ఇదుగో వెడుతూన్నాను.

చా—తొందర్లేదు. రేపువెళ్ళి ఇయ్యి.

మై—ఏమోబాబూ, నాకుమళ్ళీ నిద్దరొస్తే! నిద్దరా దొంగాడూ ఓమాటే వస్తారుకుడాను!...అబ్బె, రేపేమిటీ, తాక్షణంవెళ్ళి ఇచ్చొస్తా! (అంటూ గబగబా కుడిఎడరకి వెడుతూండగా, తెర.)



## రంగం-4

(వసంతసేన ఇంటి ఎదటిభాగం)

[L F నించి వసంతసేన వస్తూ]

వ—మదనిక ఎక్కడికి వెళ్ళిందో! ఇంత ఆలస్య మేమో! (R F కేసి చూసి) అదుగో! ఎవరో ఒక పురుషుడితో ఇచ్చకాలాడుతోంది. అతడే కాబోలు దీని దాస్యం తొలగించడానికి నిశ్చయించుకున్నవాడు. వీళ్ళకి ఆటంకం కలిగించను. కొంతసేపు ఈపక్క నిలబడి కనిపెడతాను. (L F పక్క నక్కుతుంది.)

[R F నించి వెనక నడకలో మదనికా, ఎదురుగా శర్విలకుడూ కొంచెంగా వస్తారు.]

శర్వి—(లోపల ఆవిడ వింటుందేమో అన్నట్టు సంజ్ఞ చేస్తాడు.)

మ—(L F కేసి చూసి) ఆవిడ వినదులే. ఏమీ భయంలేదు. చెప్పు, శర్విలకా.

శర్వి—(భయసందేహాలతో దిక్కులు చూస్తాడు.)

మ—ఏమిటంత భయపడుతున్నావే, మరీనూ! సంగతేమిటీ?

శర్వి—(ధ్వని పలకకుండా) చాలా రహస్యం. చుట్టుపక్కల ఎవ్వరూ లేరుగద!

మ—ఒక్క పిట్టయినా లేరు.

శర్వి—ధనం ఇస్తే ఈ వసంతసేన నిన్ను విడిచి పెడుతుందా ?

మ—ఆ.

శర్వి—నీ కెట్లా తెలుసూ ?

మ—ఆవిడే నాతో చెప్పింది. సరేగాని, నీకు ధనం ఎక్కడిది ?

శర్వి—(ఊరుకుంటాడు.)

మ—ఓహోహో ! నీ శీలంకూడా నీ శరీరంలాంటిదే అన్నమాట.

శర్వి—శీలం లేదు గీలం లేదు. సాహసిస్తేనే కదా లక్ష్మి.

మ—అయితే నాకోసం—దిక్కుమాలి దాసీదాని కోసం—సాహసప్పన్ను చేసొచ్చావా ?

శర్వి—ఆ నగ వసంతసేనకి అదిచ్చి చేయించినట్లు సరిపోతుంది. ఆవిడ కొంచెం రహస్యంగా ఆనగ ధరిస్తూండాలి.

మ—ఎక్కణ్ణించో తెచ్చిన నగ ఈవిడికి అచ్చంగా సరిపోడం ఎంత సందేహమో, ఈవిడ రహస్యంగా అది ధరించడమూ అంతే సందేహం ! సరి అసలు మాట, ఏదీ ఆ నగా ?

శర్వి—ఇదుగో (అని సువర్ణభాండం ఇస్తాడు)

మ—(పుచ్చుకుని చూస్తూ) ఇది నేను ఎరుగున్న దిలాగున్నదే! ఎక్కణ్ణించి తెచ్చావిదీ?

శర్వి—ఆగొడవంతా నీకెందుకు, పుచ్చుకుందూ, మదనికా!

మ—బస్. ఈమాత్రం రహస్యమే నాతో చెప్పడానికి జంకేవాడవ్ నన్ను పెళ్ళి ఎల్లా ఆడ దల్చావ్?

శర్వి—సరే, చెప్పేస్తాను విను. ఒక ఇంటికి కన్నం వేసి లోపల ప్రవేశించి ఇది తెచ్చాను.

మ—కన్నంవేశా? అయ్యబాబో!

శర్వి—అరే. భయానికేముందీ, నీ దాస్యం పోతుంది ఇదిచ్చేస్తే.

మ—కాదయ్యా రాక్షసీ! ఆ యింట్లో ఎవర్నీ నువ్వు చంపలేదుకద, ఎవర్నీ కొట్టలేదుకద!

శర్వి—హరి హరి! ఈ శర్విలకుడు అంత హృదయ శూన్యు డనుకున్నావా, మదనికా! నేనాయింట్లో ఎవర్నీ కొట్టలేదు.

మ—నిజమేనా?

శర్వి—నిజం.

మ—అయితే, నాకు చాలా సంతోషమే.

శర్వి—వార్నెవర్నో నేను కొట్టకుండా ఉంటే, నీకు సంతోషం ఏమిటే?

మ—సంతోషం ఏమిటా! ఈనగ నా అమ్మగారి ఆభరణమే.

శర్వి—వసంతసేన ఆభరణమిరా? అదెట్లా?

మ—ఈవిడ ఈనగ ఆయనకి దాచ ఇచ్చింది.

శర్వి—ఆ యింటి ఆయనకా? ఆయ నెవరూ?

మ—ఆర్య చారుదత్తుడు!

శర్వి—ఆఁ. ఎంత ఆశ్చర్యం? ఈవిడ ఆయనదగ్గిర ఎందుకు దాచిందీ ఈనగా?

మ—ఎందుకా! (అని, దగ్గిరకెళ్ళి చెవులో మాట్లాడు తోంది)

శర్వి—(తెల్లబోయి) అయ్యో దైవమా! (అని నెత్తికొట్టుగుని) నే నెంత పాపినీ! నీడ యిస్తూండే చెట్టు కొమ్మయొక్క ఆకులు రాల్చేశానే! ఎంతదుష్టుణ్ణి!

మ—అది ఆర్య చారుదత్తుని ఇల్లని ఎరగవా?

శర్వి—ఎరిగుండికుడా చేస్తానా, మదనికా! మరి ఉపాయం ఏమిటీ?

మ—నువ్వే ఆలోచించు. ఉపాయాల్లోకుడా పాం డిత్యం నీదే.

శర్వి—కాదు కాదు. నాకంటె ఎక్కువ నీకే తెలుసు. చిక్కుసమయంలో పాటుగోడంప్రజ్ఞ స్త్రీకే చెల్లింది. ఉపాయంచెప్పు.

మ—ఏంచెప్పనూ! ఈ నగ పట్టిగెళ్ళి ఆయనకే ఇచ్చెయ్యండి.

శర్వి—ఆయన నన్ను దండనాధికారికి అప్పగిస్తే?

మ—ఎందు కప్పగిస్తాడయ్యా శ్రీవారు ! చంద్రు డెందకొస్తాడా !

శర్వి—అదిసరి. కాని, చోటుదేవాన్ని చోరశాస్త్ర చోరితుడికి ఇచ్చెయ్యడం చోరనీతిక్రమానికి విరుద్ధం.

మ—అయితే, మరోటి చెబుతాను.

శర్వి—చెప్పి రక్షించు.

మ—చారుదత్తుడుగారే నీచేత ఈనగ పంపించా రన్నట్టు అభినయించి, నువ్వే ఈనగ వసంతసేనగారికే స్వయంగా ఇచ్చెయ్ !

శర్వి—అప్పుడు మరీ చిక్కులో పడనా ?

మ—అబ్బే !

శర్వి—అప్పు డేమవుతుందీ ?

మ—అప్పుడా, నీ దొంగతనమూ పోతుంది. ఆయన పడ్డ పూచీయూ చెల్లిపోతుంది. ఈవిడసొమ్ము సొమ్ములో పడుతుంది.

శర్వి—ఇల్లా చెయ్యడం మరీ దారుణంగా పరిణ మించదుగదా !

మ—అబ్బే, ఇల్లాతప్ప మరోకలా ఎల్లాచేసినా అదీ దారుణం, నువ్వొక్కడే ఉండు. ఎవరో వచ్చారని ఆవిడతో చెబుతాను. (అని L F కి వెళుతుంది.) అమ్మా, అమ్మ గారూ !

వసం—(L F నించి వస్తూ) ఏమే !

మ—మన చారుదత్త భట్టారకుల దగ్గిర్నుంచి వారి మనిషి—ఓ బాపనాయన—వచ్చి ద్వారందగ్గిర నుంచున్నారండి.

వసం—ఆయనమనిషా — వచ్చినమనిషి ఆయన సంబంధీ అని నీకెట్లా తెలుసునే !

మ—అహాఁ. మన చారుదత్తులవారి జనాన్నే ఎరగనుటండీ నేనూ !

వసం—(పక్కకి తిరిగి బొమలు లేవనెత్తి తల ఊగించి మెచ్చుగుని.)

—(పైకి) సరే. రమ్మను.

మ—(R F కి వెళ్ళి) రావయ్యా, శర్విలకా !

శర్వి—ఆర్యురాలా ! నీకు శుభం.

మ—ఆర్యా ! నమస్కారం. కూర్చోండి,

శర్వి—(కూచుని, వెంటనే) చారుదత్త భట్టారకులు తన యిల్లు గట్టిది కాకపోడంవల్ల తనవద్ద యిది దాచడం కష్టం అనిపించి మీరే దాచుగోవలిసిందిగా మీతో చెప్పి, ఈ నగ మీకిమ్మని అన్నారు. (అని చెప్పేసి నగయిచ్చి వెళ్ళిపోడానికా అన్నట్టు సిద్ధం అవుతాడు.)

వసం—(నగ పుచ్చుగుని) అయ్యా, ఒక్కక్షణం నిదానించండి. నన్నుకూడా చెప్పనీండి. నేచెప్పేది విని వెళ్ళి వారితో చెప్పండి !

శర్వి—(తనలో) నేను మళ్ళీ. ఆయనదగ్గిరికా ! (పైకి) ఏమనీ ?

వసం—ఏమనో ఇప్పుడే చెబుతానుగాని. ముందు ఉదాసీని మీరు మీతో తీసికెళ్ళండి.

శర్వి—ఉదాసీనా? మీమాటలు నాకు బోధపడటం లేదు.

వసం—బోధపడవలసినంత కష్టం ఏమీ లేదండీ! అయినా, కావలిస్తే సర్వమూ సుబోధకం చేస్తాను.

శర్వి—త్వరగా సెలవివ్వాలి.

వసం—ఏ పురుషుడు ఈ నగ తెచ్చి నీకిస్తాడో అతడే మదనికకి భర్త అవుతాడు—అని, చారుదత్త భట్టారకులు నాతో సెలవిచ్చిఉన్నారు గనక, మీరు మదనికని తక్షణం స్వీకరించండి, ఇట్లా స్వీకరించిన సంగతి వారితో చెప్పిపొండి.

శర్వి—(తనలో) నా హృదయం అట్టడుగువరకూ ఈవిడకి విశదం అయిపోయింది, (ప్రకాశంగా) ఆహా! ఏమండీ ఆర్య చారుదత్తుడి మహిమ! ఆయన సుగుణాలు అసాధ్యాల్ని సాధించగలవుగదా!

వసం—(R F కేసి చూసి) ఎవడురా! బండి సిద్ధం చెయ్యి!...మదనికా! నిన్ను ఈయనకి ఇచ్చేశాను. వెళ్ళు. బండియెక్కు. నన్ను మరిచిపోకేం!

మ—(వసంతసేన పాదాలకి మొక్కుతూ దుఃఖంతో) అమ్మా!

వసం—కంట తడివద్దు. వెళ్ళు. నువ్వే ధన్యురాలివి. (శర్విలకుడితో) అయ్యా! వెళ్ళిరండి.

శర్వి—భగవతీ, నీకు శుభం! మదనికా, రా! (అని RF కి నడిచి, అభిప్రాయం మారినట్టె అప్పుడే వెనక్కి వస్తూ) అమ్మా! ఒక మనవి.

వసం—అవశ్యం!

శర్వి—నేను ఒక చాటింపు విన్నాను.

వసం—ఏమనీ?

శర్వి—ఆర్యకుడనే గొల్లవాడు రాజౌతాడని జోశ్యం చెప్పినప్పటికి పాలకరాజు భయపడి ఆర్యకుణ్ణి చెరలో ఉంచాడని! ఆర్యకుడు నామిత్రుడు. నేనతనికి తోడ్పడడానికి వెళ్ళాలి. బండివాడితో చెప్పి, ఈవిణ్ణి ప్రస్తుతం నా మిత్రుడు రేభిలుడి గృహానికి పంపించండి. మదనికా! త్వరలో కలుస్తాను. (అని, R F కి తొందరగా వెడతాడు.)

మై—(R M నించి వస్తూ) ఎవరమ్మోయ్!

మ—(R M కి వెళ్ళి చూసి) అమ్మా! ఎవరో (అని వినడం నటించి) చారుదత్త భట్టారకుల దగ్గిర్నించిట వచ్చారు.

వసం—రమ్మను, రమ్మను.

మ—(R M కి వెళ్ళివస్తూ) రండి.

వసం—(మైత్రేయుణ్ణి చూసి) బ్రాహ్మణోత్తమా, నమస్కారం.

మై—గురుభ్యోనమః

వసం—ఎంతసేపాయె తమరు వచ్చి!

మై—ఝూమైంది. మళ్ళీ మాట్లాడితే ఝాంఝారపైగా అయి ఉంటుంది.

వసం—అబ్బా! ఏం చేశారు ఇంత కాలమూ?

మై—చూశాను.

వసం—ఏమిటి?

మై—ఒకటేమిటీ, అంతా చూశాను.

వసం—అంతా అంటే?

మై—అంతా అంటే, యావత్తూ అన్నమాటే! సింహద్వారమూ, ముగ్గులూ, పశువులూ, పఠనశాలా, గానశాలా, అలంకరణశాలా, వంటశాలా, భోజనశాలా, పెంపుడుపిట్టలూ, మీ పెద్దన్నయ్యా, మీ అమ్మా – ఈ రకాలన్నీ వరసెట్టి చూసేశాను.

వసం—ధన్యురాల్ని. మీ మిత్రులు కుశలమా?

మై—ఓ. కుశలమే.

వసం—స్వామీ! తమరు వచ్చిన పని చెప్పండి.

మై—మా మిత్రుడు నీతో విన్నవించాలి అన్నది ఏమిటంటే,

వసం—తప్పు తప్పు. అల్లా అనకండి. నన్ను ఆజ్ఞాపించాలి అన్నది – అనండి.

మై—కాదు. నీతో విన్నవించాలనే అతడంటా! నుదుట చేతులు జోడించి...

వసం—(తను నుదుట చేతులు జోడించి వింటుంది).

మై—"నా మిత్రుడు అభ్యాసం చొప్పున జూదం ఆడుతూ, ఆట తమకంలో, సువర్ణభాండం తనదే అని పొర బడి, పందెంకాసి, అది ఓడిపోయాడూ! అందుకు ప్రతి మూల్యంగా ఈ రత్నావళి పంపించాడు. పుచ్చుగో." అన మన్నాడు. (రత్నావళి తీసి) ఇదుగో! (అని ఇయ్య పోతాడు).

వసం—(ఊరుకుంటుంది).

మై—ఊరుకున్నావేం, పుచ్చుగోవా?

వసం—పుచ్చుగోక పోవడేం, పుచ్చుగుంటాను, తెండి. (అని, పుచ్చుగుని) సరే కానండీ, ఈవేళ ప్రదోష కాలంలో వారి దర్శనానికి నేను రాబోతున్నానని మీ యూదరిగారితో మనవి చెయ్యండి.

మై—అట్లానే. అందు కభ్యంతరవు ఏమిటీ! వెళ్ళొ స్తాను. (R F కేసి నడుస్తూ, తనలో) ఇంకా యిదీ చాలదు గాబోను. ఇంటి కొస్తుందిట మహా! ఇంటికొస్తేమాత్రం, ఇహ నేముందీ పుచ్చుగోడానికీ!! (అంటూ RFకి పోతాడు—తెర)

## రంగం-5

(చారుదత్తుని యిల్లు)

[LB వద్ద మంచంమీద ముసుగు పెట్టుకుని వసంతసేన పడుకుని ఉంటుంది.]

ర—(LF నించి రదనిక వస్తూ) ఏమండోయ్, కొత్తమ్మగారు! లేవండి. ఏమండోయ్!

వసం—ఊఁ.

ర—తెల్లారింది. ఈపాటికి లేవండి.

వసం—అప్పుడే తెల్లారిందా?

ర—ఆ. బాగా తెలివొచ్చింది.

వసం—రాత్రిభాగం యావత్తూ పూర్తి అయిపోయిందా?

ర—ఏమోనండి మరి. తెల్లారిపోయిందని మేం అనుకుంటున్నాం.

వసం—(లేచి) మీరా! అనుకోండి...అయితే, దాసీ!

ర—అమ్మ!

వసం—మీ అయ్యగారు ఏరీ?

ర—పూలతోటలోకి వెళ్లారు.

వసం—నేనెక్కడికి వెళ్ళను?

ర—మీరూ అక్కడికే వెళ్ళండి.

వసం—నేనెల్లా వెళ్ళడం?

ర—బండిమీద.

వసం—ఎవరిబండి?

ర—మాదే. బండికట్టి మిమ్మల్ని ఎక్కించుగుని తీసుగురమ్మని మా అయ్యగారు మా బండీవాడితో చెప్పి వెళ్ళారు.

వసం—అల్లానా! మామంచిమాట చెప్పావు! నేను, రాత్రి, వారిని తిన్నగా చూడలేదు. ఇప్పుడు చూడాలి... అయితే దాసీ, నేను రాత్రి ఇక్కడికి వచ్చిఉండడం మీ అమ్మగారికి కష్టంగాఉన్నదా?

ర—లేదు. కాని, ఇకముందు కష్టంగా ఉండచ్చు.

వసం—ఎప్పుడు?

ర—మీరు వెళ్ళిపోగానే.

వసం—అదా! కాని, అప్పుడైనా నాకు కూడా కష్టంగానే ఉంటుందిస్మా!... చేటీ, ఇట్లారా! ఇది తీసుకో. "మీభర్తకి నేను దాసురాల్ని. నాకంఠాన్నికాదు ఈనగ ఉండవలసింది, మీకంఠాన్ని" అని నామాటలుగా చెప్పి, మీఅమ్మగారు ధూతాదేవిగారికి ఈ రత్నావళిఇచ్చి, రా. (అని రత్నావళి తీసిఇస్తుంది.)

ర—(పుచ్చుగోక) ఏమోనండీ. అయ్యగారు కోప్ప డతారు.

వసం—భయంలేదు, పట్టిగెళ్ళు. (అనియిస్తుంది.)

ర—(రత్నావళి పుచ్చుకొని L F కి పోయి, మళ్ళీ అప్పుడే వచ్చేస్తుంది.)

వసం—ఏమిటి? ఏమన్నారు?

ర—పుచ్చుగోలేదండీ, తన భర్తగారు మీ కిచ్చేసింది మీ దగ్గిర్నించి పుచ్చుగోడం కూడదన్నారంట. తన భర్తే తనకి అలంకారం అన్నారు, ఇదుగో.

వసం—(రత్నావళి పుచ్చుగుని ఆశ్చర్యపోతుంది.)

[L M నించి రోహసేనుడు వస్తాడు. L B దగ్గిర ఉన్న మట్టిబండి రదనిక తోస్తూ]

ర—రా, బాబూ, రా! ఆడుకుందువుగాని, రా! ఇదుగో బండి!

రో—నాకీబండి అక్కర్లేదు. దీంతో నే నాడుకోను. ఇందాకటిబండి కావాలి.

ర—అది వాళ్ళబండి బాబూ! వాళ్ళబండి, వాళ్ళు పట్టుకుపోయారు. నాన్నగారికి డబ్బు వచ్చింతరవాత, నువ్వు కూడా, ఇంచక్కటిబండీ, చెయించుకుందుగాని! ఏం? నువ్వు మంచి బాబువి కాదూ! పట్టటచ్చా...అదుగో ఆవిణ్ణి చూడు!

వసం—(మొదణ్ణించీ కుర్రాణ్ణి ప్రేమతో చూస్తూ) ఈ అబ్బాయి ఆర్యపుత్రులికి...

ర—కుమార రత్నం.

వసం—అలాగే అనుకున్నాను, చూడగానే, రావయ్యా తండ్రీ, రా! (అని రోహసేనుణ్ణి ఎత్తుగుని ముద్దాడుతూ) ఏమిటి అలుగుతున్నావు?

ర—ఏమున్నదీ? నిన్న పొరిగింటి పిల్లాడితో బంగారపు ఆటబండితో ఆడుకున్నాడు. వాళ్ళు బంగారుబండి వాళ్ళు తీసుగుపోయారు. ఈయన ఆడుకునేందుకు నే నీ మట్టి బండి తయారుచేశాను. దీంతో ఆడుకోను, నాకీ బండివద్దు, నిన్న నాడుకున్న బండే కావాలంటాడు. మా కిప్పుడు బంగారు బండి ఎల్లావస్తుంది చెప్పండి.

వసం—అయ్యో! చారుదత్తులవారి కుమారుడికా ముద్దు చెల్లకపోవడం! ... అబ్బాయీ! ఏడ్వకమ్మా! నిన్నటిలాంటి బండితోనే ఆడుకోందుగానిలే.

రో—రదనికా, ఇదెవరూ?

వసం—మీ నాన్నగారి దాసురాల్ని, నాయనా.

ర—కాదు బాబూ! నీకు ఇంకో అమ్మ అవుతుంది.

రో—నీవన్నీ ఉత్తాబద్ధాలు. మా అమ్మైతే మరి ఇన్ని నగలున్నాయేం?

వసం—(కళ్ళనీళ్ళు గిరుక్కున తిరగగా, నగలన్నీ తీసేసి) ఇప్పుడు మీ అమ్మనేనా, నాయనా!

రో—అల్లానే ఉన్నావు.

వసం—(నగలు మూటకట్టి) ఈ నగలన్నీ పుచ్చుకో బాబూ! పుచ్చుగుని నిన్ననాడుకున్నావే అల్లాంటి బండి చెయించుగో.

రో—మరి నువ్వేడుస్తున్నావేం ? అయితే నా కక్కర్లేదు, ఇవి.

వసం—(కళ్ళనీళ్ళు తుడిచెసుగుని) ఏడవనమ్మా ఏడవను. వెళ్ళు. (అని, నగలమూట మట్టి బండిలో వేస్తుంది).

ర—అల్లా అల్లా వెళ్ళిపద్దాం రాండి. (అని రోహసేనుడితో R M కి వెళ్ళి, అప్పుడే వెనక్కివచ్చి) కొత్తమ్మగారూ ! బండి తోలుకొస్తున్నాడు మా వర్ధమానకుడు.

వసం—ఒక్కక్షణం ఉండమను. నాకూడా తెచ్చుగున్న నగలతో కొంచెం అలంకరించుగుని వస్తాను. (అని R B కి పోతుంది.)

(రెండో తెర పడుతుంది))

వర్ధ—(R F దగ్గిర బండిచక్రం కనపడేటట్టు బండి ఆపివచ్చి) రదనికా !

ర—(R M నించి వస్తూ) ఆఁ. కొంచెం ఆగు. ఆవిడ అలంకారం చేసుగోడానికి వెళ్ళారు.

వర్ధ—ఎట్లాగమ్మా ఆగడం ? బండిగిత్తలు పొగరు మోతురకం.

ర—ఎదరనుంచో కాస్సేపూ.

వర్ధ—బండీలో యేసే రంగుదుప్పటి మరిచిపోయి వచ్చిను.

ర—ఇహనేం. ఇంతలో వెళ్ళి తీసుగురా.

వర్ధ—నే వెడితే గిత్తలు ఆగవు. పోని బండీ విప్పెయ్యనా ?

ర—వద్దు. నిమిషంలో వస్తుంది ఈవిడ.

వర్ధ—సరే. పోని బండీ తోలుకుంటూ నేయెళ్లి మళ్లీ వత్తాను. (అని, R F కి పోతాడు. వచ్చిన బండి వెళ్ళిపోయినట్టు జనానికి తెలియాలి).

ర—(R M కి పోతుంది).

(R F దగ్గిర ఓఓ హోహో అహెహెయ్ ఆ ఆ— లాంటి కేకలు వినిపించి, మరో బండి వచ్చి ఆగినట్టు చక్రం రంగు కనపడాలి.)

[స్థావరకుడు R F నించి వస్తాడు]

స్థా—(R F నించి వచ్చి) శకారుడుగారు నన్ను బండి తోలుకుని పుష్పకరండకపు తోటకి రమ్మన్నారు. (L M కేసి చూసి) అబ్బో! ఈ రాజమార్గంనిండా బళ్ళే. ఇల్లా వెళ్ళలేను. (L F కేసి చూసి) ఏయ్, బళ్ళవాళ్ళు! తప్పుకోండి. ఇది శకారుడుగారి బండి. ఒరేయ్. సబండి తప్పించరా! అరెరే! చక్రం ఊడిపోయిందా? ఇరుసుకి అది మళ్ళీ ఎక్కించాలా? పోన్లే వస్తానుండు. నాబండి ఇక్కడ ఉండనిచ్చి వస్తాను. (అని L F కి నిష్క్రమిస్తాడు.)

ర—R M నించి వచ్చి) అమ్మా! అదుగో చక్ర ధ్వని! అదుగో బండి, రండి.

వసం—(R M నించి వచ్చి బండీఎక్కడం నటించి R F కి వెళ్ళిపోతుంది.)

ర—నే వెడతానండి (అని RM కి వెళ్ళిపోతుంది.)

స్థా—(L F నించి వచ్చి) అబ్బ! చక్రం ఇరుసుకి పట్టించేసరికి చేతులు బొబ్బలెక్కినాయి. (RM కేసి చూసి) ఆఁ. వీథులు కొంచెం ఖాళీ అయినాయి. మరి నాబండి పోనియ్యొచ్చు. (అని R F కి నిష్క్రమించి, తను ఆపిన బండి తోలుకుపోతూన్నట్టు నటిస్తాడు.)

( తెరలో )

ఆర్యకుడు సంకెళ్ళు తెంపుకొని చెరసాలలోంచి పారిపోయాడు. కావలివాళ్ళు జాగ్రత్త. ప్రయత్నించి వాణ్ణి పట్టుకోండి, పట్టుకోండి.

[L M నించి ఆర్యకుడు, భయపడుతూ, తెగిన కాలి గొలుసు వేళ్ళాడుతూండగా వస్తాడు]

ఆ—అమ్మ! త్వరగా పోవాలి. శర్విలకుడి దయ వల్ల నేను బంధవిముక్తుణ్ణి అయాను. కాని, నేను ఎక్కడ దాక్కోనూ? ఈ పక్కయింట్లో దూరతాను. ఆఁ ఆఁ. ఏదో బండివచ్చి ఆగుతోందే!

(R F నించి వర్ధమానకుడు రాబోతూంటే భయపడి ఆర్యకుడు R M కి వెళ్ళి దాక్కుంటాడు.)

వర్ధ—(R F నించి వచ్చి) రదనికా రదనికా! ఆవిణ్ణి బేగే రమ్మను రమ్మను. ఈ దుప్పటీ మరవడంనించి ఆలస్యం అయిపోయింది. (అని పిల్చి R కి తిరిగి R F దగ్గిర నిలబడతాడు.)

ఆర్య—(R M నించి ఇవతలకి వచ్చేసరికి ఇనపగొలుసు చప్పుడవుతుంది.)

వర్ధ—అమ్మయ్య! అదుగో అందెలచప్పుడు. నేను ముందు నుంచుంటాను, మీరు జాగర్తగా వెనకనించి ఎక్కండమ్మగారు! (అని R F కి పోతాడు. ఆర్యకుడు కూడా R F కి పోతాడు.)

(రెండో తెర లేస్తుంది. ఇవతల చక్రం సగంలా కనబడే పాటంలో బండి ఉండాలి. ఎడ్లని విప్పేసినట్టు, కాడి నేలమీద. R F నించి చందన వీరకులు వస్తారు.)

వీ—ఎవరు నువ్వు?

వర్ధ—నా పేరు వర్ధమానకుడు.

వీ—ఈబండీ ఎవరిది?

వర్ధ—చారుదత్తుడి గారిది.

వీ—బండిలో ఎవరున్నారు?

వర్ధ—వసంత సేన.

వీ—ఎక్కడికి వెడుతుందీ?

వర్ధ—పుష్పకరండకంలోకి.

చం—అయితేసరే, పోనియ్యొచ్చు. పోనియ్.

వీ—ఆఁ! చూడకుండానే పోనియ్యడం!

చం—చూడక్కర్లేదు, పోనిస్తా.

వీ—ఎవరి పూచీమీదా?

చం—చారుదత్తుడి పూచీమీద.

వీ—పోదూ ! చారుదత్తుడెవరు, వసంత సేన ఎవరూ?

చం—ఓరి దరిద్రుడా ! వాళ్ళిద్దర్నీ ఎరగనివాళ్ళు చంద్రుణ్ణీ వెన్నెల్నీ ఎరగరన్నమాట.

వీ—ఒక వేళ ఎరుగుంటేమాత్రం, ఇదేమిటి రాజ కీయం అనుకున్నావా మరోటా ?

చం—అందుకనే, నువ్వు రాజుగారికి నమ్మిన సేనా పతివి గనక, నువ్వే వెళ్ళిచూస్కో.

వీ—నువ్వూ అంతేగా, నువ్వేచూడు !

చం—నేచూ స్తే నువ్వు చూసినట్టేనా ?

వీ—నువ్ చూ స్తే నేనుకాదు, రాజుగారే చూసి నట్టు! చూడు.

చం—మరి నువ్వు తప్పుకో. ఒరీ, బండివాడూ ! కాడెత్తు. (చందనకుడు బండిలోకి చూస్తాడు. గూడులోపలి వెనకపార్శ్వం సభకి కనిపించాలి. అందులోఉన్నవ్యక్తి చం దనకుడికి పెట్టే దణ్ణంకూడా సభవాళ్ళు గమనించేట్టుండాలి. నీకు భయంలేదులే అన్నట్టు చందనకుడు చెయ్యి ఊపడం కూడా సభకి బోధపడాలి).

—ఆ. ఆర్యుణ్ణి చూశాను. అసగా అదే ఆర్యు రాల్ని, వసంతసేనని. తను చారుదత్తుడి దగ్గిరికి వెళుతూంటే తనని ఆపడం ఏమిటని నన్ను కోప్పడింది.

వీ—ఏమో ! నాకు సందేహంగా ఉంది.

చం—ఏంచేత ?

వీ—మొదట 'ఆర్యాణ్ణి' అన్నావ్, తరవాత 'ఆర్యా కాల్ని' అన్నావ్.

చం—ఓస్, అదా! మనం 'ఆర్యకుణ్ణి' గురించి కాదూ పరిశోధిస్తున్నాం. ఆ పేరే మనస్సులో ఉండడంవల్ల నా నోటంట అల్లా వచ్చింది. అంతేగాని అంతకన్న ఏమీ లేదు.

వీ—అయితే, బండీ నేనుకూడా పరిశోధిస్తాను. రాజుగారి ఆజ్ఞ. రాజుకి నేనంటే నమ్మకం.

చం—నేనంటే నమ్మకంలేదా ?

వీ—ఉండొచ్చు. రాచవ్యవహారం దగ్గిర సగం సగం పన్లు కూడదు.

చం—(తనలో) సరే. దెబ్బలాటపెడతాను. (పైకి) ఒరేయ్, సన్నాసీ! నేను బండీ పరిశోధించడం అయింది కదా, తరవాత మళ్ళీ నువ్వెందుకురా ? అనామకుడివీ ?

వీ—ఓస్! మహా నామకుడివి బయల్దేరావ్, పోదూ!

చం—రాజు కాస్త చనువు ఇచ్చాడుకదా అని మిట్టిపడకురా. పదిసార్లు నీకు రాజు దర్శనం ఇవ్వడంతో అక్కడికి కడుపునిండినట్టు సంతోషిస్తున్నావు. నీకు శూన్యమే మిగుల్తుంది.

వీ—ఒరేయ్, నీకు జాతిఏదిరా ?

చం—సరే నీకు నీతిఏదిరా ? నేచూస్తే చాలన్నావుగా !......కానీ, పోయి బండీ చూడూ !

వీ—ఒరేయ్, బండివాడా, బండెక్కి లోపల చూస్తాను కాస్కో! (అని, వీరకుడు బండి ఎక్కపోతూంటే చందనకుడు వాణ్ణి పట్టుకుని కిందికి లాగుతాడు, పడేస్తాడు, తన్నుతాడు).

—(కోపంతో లేచి) ఒరేయ్, చందనకా! జ్ఞాపకం ఉంచుకో. నేను రాజకార్యం నిర్వహిస్తూండగా, నువ్వు నన్ను జుట్టుపట్టుకుని తన్నేశావ్. దండనాధికారితో ఈ సంగతి చెప్పి సభలో పెట్టి నిన్ను బొండని వెయించకపోతే నేను వీరకుణ్ణే గాను, మీసంమీద చెయ్యా, హేం!

చం—దండనాధికారితో చెప్పుగో, ఏకంగా దండధరుడితో చెప్పుగో. పో హెయ్, పో. నువ్వేంజెయ్యగలవురా, కుక్కా! పోతావా లేదురా?

వీ—(L F కి నిష్క్రమిస్తాడు)

చం—ఒరేయ్, బండివాడా, బండికట్టు. త్వరగా తోలుకుపో! ఎవరేనా ఆపి పరీక్షిస్తాం అంటే "చందనక వీరకులు పరిశోధించడం అయింది" అని చెప్పు.

—ఇదుగో ఓ వసంతసేనా! నీకీ గుర్తు ఇస్తున్నాను తీసుకో! (అని కత్తి ఇస్తాడు).

—వసంతసేనా! సంపదలనాడు నన్ను మరవకేం!

ఆర్య—(జోడించిన చేతులు ఇవతలకి చాపుతాడు)

(బండి L B కేసి నడుస్తూండగా - తెర).

రంగం-8

[పాడుపడిపోయినట్టు కనిపించే పూలతోటలో ఒక పార్శ్వం. ఎడమ మధ్యనించి మొదట మైత్రేయుడూ వెనకాల చారుదత్తుడూ వస్తారు.]

మై—(ఇటూ అటూ తిరిగి) అబ్బబ్బా, మిత్రమా! ఈ తోటలో ఇంకా ఎంతసేపు మనం తిరగడం? ఇహ నింటికి పోదాం పద! మరి వసంతసేన వచ్చేట్టులేదు.

చా—అట్లానే. మరి ఒక్కక్షణం చూసి చక్కాపోదాం.

మై—పూర్వం ఈతోటలో అన్నిరకాల పుష్పాలూ ఉండేవి కాబోలు!

చా—ఇప్పటికీ ఉన్నాయిగా, (చూపిస్తూ) అవిగో!

మై—ఔరే, చోద్యం అవుతుంది. ఈతోట ఎంత జీర్ణించినా దీని పూర్వసువాసన వేస్తూనేఉంది—ఇది మంచి పూర్వసువాసిని!

చా—మరే! కొన్ని పుష్పవృక్షాలు ఇప్పుడుకూడా బారులుతీర్చి వీధులులా ఉన్నాయి, చూడు.

మై—మరే. వీటియిల్లు బంగారంగానూ!

చా—ఒక్కొక్క వృక్షం ఒక పువ్వులఅంగడి.

మై—తగుమాత్రం తుమ్మెదలుగా ఉన్నాయి.

చా—అంగళ్ళకి బేరం చెయ్యడానికొచ్చే పురుషుల లాగ!

మై—అల్లానే. మొత్తంమీద ఈ వనానికే సంస్కారం ఉంటే ఒకటోరకంగా ఉండిపోయేది, ఇప్పుడైనా దీని సొగసు తక్కువంటావా ?

చా—ఎంతమాత్రం కాదు. దీనికి సహజంగానే సౌందర్యం ఉంది.

మై—అల్లా అన్నావ్, నచ్చింది. అయితే మరి మిత్రమా ! ఈ రాతిబండమీద కూర్చో.

చా—(కూర్చుంటాడు.)

మై—కాని, కనిపెట్టుగుని ఉండడం అనేదిమాత్రం మహాకష్టం, దీని మొహం ఈడ్చా !

చా—నువ్వు వాడితో చెప్పలేదూ ?

మై—చెప్పకపోవాలిగుడానూ ! సెబాసు ! చెవులు ఘుమీయలు పడేటట్టు చెప్పాను.

చా—ఎవరితో ?

మై—సరిపోయిందయ్యోయ్ ! వర్ధమానకుడితో.

చా—ఏమని ?

మై—ఓహోహో ! నేనంత మందమతిననా, ని ఉద్దేశం — వసంతసేనని మిక్కిలి త్వరగా ఈ జీర్ణోద్యానంలోకి బండిమీద తీసుకురారా అని చెప్పాను.

చా—చెబితే, మరి వాడింత ఆలస్యం చెయ్యవలిసిన కారణం ఏమిటీ ?

మై—ఏమో ! నేను అప్పణ్ణించీ నీదగ్గిరే ఉన్నాగా! వాడింటూ అసలువస్తే, వాడే చెప్పాలి.

చా—ఏ చక్రం మేకైనా ఊడిపోయిందేమో !

మై—ఏమో, ఏంధరో !

చా—మామూలుదారిలో ఏ చెక్లైనా కూ త్తే, మరో దారి వెంట వస్తున్నాడేమో !

మై—ఏమో, ఏందారో !

(కుడి ఎడర్నించి, హోహో ఆహా హాయ్ అని బండీ ఆపడానికి బండివాడు వేసె కేకలుబాగ వినిపిస్తాయి.)

—అదుగో ! అది మన వర్ధమానకుడి గొంతిగే ! బండి వచ్చింది.

వర్ధ—(కుడిఎడర్నించి వస్తూ, ఆగి) అయ్యగారండి. బండివచ్చింది.

మై—ఏమిరా వర్ధమానకా !

వర్ధ—అయ్యా !

మై—ఇల్లా నేట్రా పన్లు చెయ్యడం ? ఏమిటీ ఆలస్యం ?

వర్ధ—కోప్పడమోకండి, బాపనయ్యా ! కూంతంత ఆలస్యం అయింది.

మై—కూంతం తేమిటి నీబొందా ! లక్ష ఆలస్యం అయితేనూ !

వర్ధ—ఎంజెయ్యమంటారూ ! బండిలోయేసే దుప్పటీ మరిచాను. రెండు మూడు తేపలు ఇటూ అటూ తిరిగాను,

మై—నీ సమర్థింపు ఏడిసినట్టేఉంది. ఒకమాటు దుప్పటీ మరిచిపోతే, నువ్వు దానికోసం రెండు మూడు

సొగ్గు తిరగడం చేసిక ! ఓమాటు తిరిగి ఊరుకోవాలిగాని !
సరే. ఇప్పుడేనా బండీ తోలుకొచ్చావా, ఈ దుప్పటీమాట
చెప్పడానికి ఖరాగా నువ్వే వచ్చావా ?

వర్ధ—బండి తోలుకొచ్చానండి.

చా—ఇక చాలుమిత్రమా ! వాణ్ణి ఏమీ అనకు.
ఏదో ఆలస్యం అయింది.

మై—మిత్రమా ! అట్లానే, ఆలస్యంవల్ల నీమనస్సు
కష్టపడిందేమో అని అన్నాను.

చా—సరేగాని, వెళ్ళి వసంతసేనని బండిలోంచి
దింపు.

మై—సరిపోయింది మిత్రమా ! వసంతసేన కాళ్ళకి
సంకెళ్ళేమన్నా ఉన్నాయా ఏమిటీ ! ఆవిడే దిగుతుంది
చిలకలాగ.

చా—సరే. అట్లావెళ్ళి ఆవిడ దిగేటప్పుడు దగ్గరసా
నుంచో.

మై—ఓ. (అని కుడి ఎదరకి వెళ్ళి బండిలోకి చూసి
నట్టు నటించి) ఏమయ్యోయ్, మిత్రమా ! ఇదేమిటీ,
వసంతసేన కాదయ్యో బండీలోమనిషి, వసంతసేనుడు - అను
కుంటాను.

చా—వేళాకోళానికి ఇది సమయమా సందర్భమా,
మైత్రేయా ! ముందు ఆవిణ్ణి దింపించు. లేకపోతే, నేను
దింపిస్తాను.

మై—(వెనక్కి వస్తా) నేనూ దింపించక్కర్లేదు, నువ్వూ దింపించక్కర్లేదు. బండీలో కూర్చుని వచ్చిన అబ్బాయి. దిగి, ఇట్లా వస్తున్నాడు.

[ కుడి ఎదరనించి తెగిన కాలిసంకెలతో గోపాల దారకుడు దీనంగా చేతులు జోడించి వస్తాడు ]

చా—(వచ్చే అతణ్ణి చూస్తూ, తెల్లబోయి, తనలో) ఔర ! ఏమిచిత్రం ! ఆకర్ణాంతనేత్రాలు, విశాల వక్షం, ఉన్నతభుజాలు - ఇల్లాంటి వాడికి సంకెళ్ళు ఎట్లా వచ్చాయి చెప్మా ! (పైకి) అయ్యా ! మీ రెవరు ?

ఆ—నేను ఆర్యకుణ్ణి. గోపాలదారకుణ్ణి. శరణాగతుణ్ణి.

చా—(జ్ఞాపకం చేసుగోడం నటించి) ఓహో ! పాలకమహారాజు వ్రేపల్లెనించి పట్టితెచ్చి బంధించినవారా !

ఆ—చిత్తం. శరణు వేడుకుంటున్నాను.

చా—నేను రిక్తుణ్ణిగాని, మీకు శరణు ఇస్తున్నాను.

ఆ—నన్ను విడనాడకండి, అప్పగించెయ్యకండి.

చా—ప్రాణాలైనా విడుస్తానుగాని, శరణన్నమనిషిని విడవను. వర్ధమానకా ! ఇతడి కాలిసంకెళ్ళు ఊడదియ్యి.

వర్ధ—చిత్తం (అని ఆర్యకుడి సంకెళ్ళు ఊడదీస్తాడు.)

ఆ—(తనలో) ఆహాహా ! లోగడ చారుదత్తుడి గురించి విన్నానేగాని వ్యక్తిని చూడలేదు. ఏమి ఇతడి రూపమూ, ఏమి ఇతడి స్నేహమూ ! (పైక) మహాశయా !

మీరు నా కాలి యినుపసంకెళ్ళు తీయించడంలో ఇనుంకంటె దృఢతరమైన సంకెళ్ళు మా హృదయాలకి వేసేశారు. ధన్యుణ్ణి.

మై—అడ్డమా! సుత్రమా! ఈయన తెరిపిని పడ్డారు. మనం పోదాం పద.

చా—కొంచెం ఓపికపట్టుమరీ!

ఆ—ఆర్యా! చారులు నన్ను వెంటాడించే సమయంలో, మరోదిక్కు లేక, ఈబండి శూన్యంగా కనపడగా, ఇందులో దాక్కున్నాను. నా అదృష్టవశంచేత, ఈబండి తమరిదే కావడమూ అది మీదగ్గిరికే వచ్చెయ్యడమూ జరిగాయి. క్షమించండి.

చా—మీస్నేహం మాకు దొరికింది, నమస్కారం.

ఆ—మీరు సెలవిస్తే మరి నాదారిని నే పోతాను.

చా—మంచిది, అల్లానే కానీండి. కాని, ఒకమనవి.

ఆ—అవశ్యం చెప్పండి.

చా—ఇప్పటిదాకా సంకెళ్ళు దిగలాగుతూన్న ఈ కాళ్ళతో మీరు చకచకా నడవలేరు. రాజభటులు మీకోసం పొంచిఉంటారు. నామాటవిని, మీ రీబండిలోనే రహస్యంగా వెళ్ళండి.

ఆ—ఆహా! ఏమి తమ అంతఃకరణ! మీ ఆజ్ఞకి బద్ధుణ్ణి.

చా—వర్ధమానకా! బండీకట్టి వీరి యిష్టంవచ్చిన చోట వీర్ని చేర్చి, రా. అయ్యా! సెలవు. త్వరలో మీస్నేహితుల్ని మీద కలియడం చేయూరాలని కోరు తున్నాను.

ఆ—మీరుగాక నాకు మరి స్నేహితు లెవరూ?

చా—మీకు ఇంతమాత్రం మాసంగతి జ్ఞాపకం ఉంటే, మాకు అదే పదివేలు.

ఆ—మిమ్మల్ని మరిచిపోయేటంతటి నీచత్వానికి ఒడికట్టగలనా?

చా—దేవుడు మిమ్మల్ని రక్షించుగాక.

ఆ—మీరే నాదైవం.

చా—అట్లా అనకండి. మీ యోగమే మిమ్మల్ని కాపాడుతుంది.

ఆ—ఆ యోగానికి కారణభూతుల్లు మీరే.

చా—అంతా నిమిత్తమాత్రం. మరి జాప్యంవద్దు. శత్రువుల్నించి తప్పించుగుని క్షేమంగా ఉండేచోటు చేరు కోండి.

ఆ—సెలవు. మళ్ళీ కలుసుగుందాం. నమస్కారం. (అని, కుడిఎడరకి నిష్క్రమిస్తాడు. వర్ధమానకుడు కూడా అటే వెళ్ళి బండీ బయల్దేర తోలిన కేకలు వేస్తాడు).

చా—మిత్రమా! మనం పోదాం, పద.

మై—అవ్వునే!... కాని, వసంతసేనకోసం కనిపెట్టుకు కనిపెట్టుకు కూర్చోగా, ఈ యింతపగొలుసుముక్క చేతికొచ్చింది.

చా—అది ఆ (అని R B కి చూపిస్తూ) పాడునూతిలో పారేసి, రా.

మై—ఆ. (అని R B కి వెళ్ళివస్తూ) అది మనదగ్గిర ఉంటేం?

చా—మనం ఆర్యకుడికి శరణివ్వడం పాలకరాజు గారికి ప్రతికూలం. పాలకరాజు చారులు మనజాడలు తీస్తూంటారు. అందుచేత ఆ గొలుసుముక్క మనదగ్గిర ఉండకూడదు.

మై—పోనీ, అవును, దిక్కుమాలిగొలుసు. పారెయ్యడమే నయం.

చా—కుర్రాడు ఆడుకుంటూన్న చిన్న మట్టిబండిలో వసంతసేన పోసిన నగలున్నమూట ఏదీ?

మై—ఇదుగో (అని చంకకి తను తగిల్చి తెచ్చిన మూట చూపిస్తాడు).

చా—వెంటనే ఆవిణ్ణి కలుసుగుని ఈ నగలు ఇచ్చెయ్.

మై—తక్షణం ఇచ్చేస్తా. ఈ చిక్కంతా మనికి ఈ వర్ధమానకుడివల్ల వచ్చింది.

చా—ఎట్లా ?

మై—వాడికి శాస్త్ర జ్ఞానం ఉండకూడదూ ?

చా—ఏంజ్ఞానం ?

మై—ఏంజ్ఞానమూ ! స్త్రీపురుష జ్ఞానం. బండిలోకి ఎక్కుతూన్న వ్యక్తి ఆడదో మొగాడో గ్రహించుగుని మరీ ఎక్కించుగోవద్దూ వాడూ ! శూన్యశకటం ఎక్కానని ఈ వచ్చిన అబ్బాయి అన్నాడు. వసంతసేన అసలు ఎక్కనే లేదేమో !

చా—నడు నడు. కనుక్కుందాం.

(ఇద్దరూ తొందరగా L M కి వెడతారు. తెర.)

—*—

## రంగం-7

(స్యాలకుని తోట)

[LF నించి బౌద్ధసన్న్యాసి వేషంలో సంవాహ
కుడు చేతులో తడిబట్టతో వస్తాడు.
RF నించి శకార విటులువస్తారు].

శ—ఆగరా! సన్న్యాసిగా! (అని వెళ్ళి వాణ్ణి తన్ను
తాడు).

వి—అసలే వాడు సన్న్యాసిగదా, వాణ్ణెందుకూ
తన్నడం! తోట బాగసు చూద్దాం.

స—స్వాగతం, ఉపాసకా!

శ—బావా, చూడరోయ్! వీడికి నేను ఉపాస్కాట.

వి—అంటే, ఫరవా లేదు.

శ—తిడుతున్నాడూ.

వి—తిట్టండే!

శ—ఉపాస్కా అన్నాడుగా! ఉపాస్కా అంటే
మంగలి కాదూ!

వి—అబ్బె కాదు. నిన్ను పొగుడుతున్నాడు.

శ—అల్లానా, ఏమిటో అనుకున్నాను. అయితే,
ఒరీ బోడీ! నన్ను పొగడరా!

స—ఓ! మీరు చాలా గొప్పవారు.

శ—సరేకాని, నువ్వెందుకురా ఇక్కడి కొచ్చావ్?

స—ఈబట్ట ఝూడించుగోడానికి.

శ—ఓరిశుంఠా ! మాబావ నాకీతోట ఇచ్చాడు. ఇందులోఉన్న ఆ సరస్సులో కుక్కలూ నక్కలూ నీళ్ళు తాగుతాయి, నేను ఒఖ్ఖర్తే స్నానంచేస్తాను. ఇందులోన్రా నీబట్టఝూడింపూ ! తన్నేస్తాను జాగర్త.

వి—కాణేలీమాతృకా ! వీడు సన్యాసం కొత్తగా పుచ్చుగున్నాడు.

శ—అది వీడుపుచ్చుగునేటప్పుడు నువ్వెందుకున్నావ్ అక్కడా ! నీకెల్లా తెలుసూ ?

వి—వీడి వాలకమే తెలుస్తోంది.

స—స్వామీ నిజమే. ఈమధ్యనే సన్యసించాను.

శ—పుట్టగానే నువ్వు ఎందుకు సన్యసించి ఉండ లేదురా మూర్ఖా ! (అని తన్నుతాడు)

స—బుద్ధదేవుడా, శరణు (అని పడుస్తాడు).

వి—బావా, పోనీ వీణ్ణి వొదిలెయ్.

శ—ఉండరా, వొదిలెయ్యాలో అఖ్ఖర్లేదో ఆలోచించుతాం.

వి—ఎవరితో ?

శ—నాతోటే.

వి—త్వరగా తేముల్చుమరి.

శ—ఒసీ, నా గుండెకాయా ! చెప్పవే ! ఈ సన్యాసిని (చూపుడువేల్తోనూ మధ్యవేల్తోనూ తన ముక్కు వరసని

తాటించుకుంటూ) వదల్నా మాన్నా వదల్నా మాన్నా ?
ఏమంటావ్ ! వదలావద్దు మానావద్దు అనా ! శేష్ !

వి—ఏమంది సహృదయం ?

శ—వదలావద్దు మానావద్దు అంది. ఎగఊపిరి విడవ
నీకు దిగఊపిరి లాగనీకు, పడి చావనీ - అంది.

స—బుద్ధదేవా ! శరణు.

వి—పోనీ వీణ్ణి విడిచిపెట్టు.

శ—ఒకపని చెయ్యగలిగితే విడిచిపెడతా !

వి—ఏపని ?

శ—నీళ్ళు మూటకట్టమను.

స—(పైకిచూస్తూ) ఇలాంటి రక్కసి పశువులకి
అంత మెప్పుకు బుద్ధదేవా! (అని, చటుక్కున L F కి వెళ్ళి
పోతాడు).

శ—దేవా అంటున్నాడు నన్నేనా ?

వి—నిన్నే. నిన్ను పొగుడుతున్నాడు.

శ—పోనీ వచ్చి పొగడమను.

వి—వాడు పోయాడోయ్, గూఢోత్పన్నా ! కాని,
ఈతోట మజా చూస్తివా ?

శ—నిజమే. ప్రమాణికంగా నిజమే.

వి—కాణేలీమాత్ర కా ! ఈ రాతిమీద కూచో.

శ—కూర్చున్నాను. కాని బాబోయ్ (అని బారు మని) అయ్యబాబయ్య బాబోయ్, బావోయ్, బాబోయ్! (అని గొల్లుమని ఏడుస్తాడు).

వి—ఏమి టేమిటీ?

శ—(ఏడుపు ఆపుగుని) ఆ దిక్కుమాలిశని, వసంత సేన, మరుపు రావటంలేదు. దానింటికెళ్ళాలి. బండి త్వరగా తీసుకు రమ్మంటే ఆ స్థావరకుడు ఇంకా రాలేదు. నాకు చచ్చే ఆకలేసిపోతోంది. అయినా వాడు రాడాయిరి! పోనీ కొంచెం గానం చేస్తాను - కోమల గానం! (అని ఏడుపు వాలకంగా పాడతాడు) ఆఁ ఆఁ (అని మధ్య ఆగి, చప్పుడు విన్నట్టు నటించి విటుణ్ణి కౌగిలించుకుని) బావోయ్, నేపోతాను, నేపోతాను, మరి ఉండను.

వి—అప్పుడే పోతావా? ఎక్కడికీ? పైకే!

శ—వసంతసేన యింటికి.

వి—ఎల్లా?

శ—బండిమీద. అదుగో విను, బండి వచ్చేస్తోంది.

వి—నీ కెట్లా తెలిసిందీ?

శ—నాకంటికి ప్రత్యక్షంగా వినపడుతోంది బండీ ధ్వని. నీకుమాత్రం కనపట్టంలేదూ పందిలాగ గురగురలాడుతూంటే!

వి—అవును. నిజమే. బండి వచ్చింది.

శ—పుత్రుడా, స్థావరకా! వచ్చావా?

స్థా—(L M నించి వచ్చి) వచ్చాను.

శ—బండో ?

స్థా—బండీవచ్చింది.

శ—అయ్యో! ఎడ్లు రాలేదా ఏమిటి ?

స్థా—అవీ వచ్చాయి.

శ—అయితే వారీ, సేమాట! నువ్వుకూడా వచ్చి నట్టేనా ?

స్థా—(నవ్వుతూ) భట్టారకా, నేనుకూడా పూర్తిగానే వచ్చేశాను.

శ—పోనీలే పాపం! బండి ఆపు. వచ్చి ఎక్కుతాను. (అని L M కేసి నడిచి, ఎక్కడం అభినయించి, వచ్చి విటుడి కంఠం పట్టుగుని) బాబోయ్. బాబోయ్ !

వి—ఏం ఏం ?

శ—నేను చచ్చిపోయాను.

వి—వెధవ. అబద్ధాలు. దెయ్యంఅల్లా ఉన్నావు. అసలు సంగతి ఏమిటీ ?

శ—(ఆయాసంతో) వాట్టిబండీయేమో ఎక్కుదాం అనుకుని వెళ్ళాను. కాని, బండిలో ఓ రాక్షసి కూచుంది.

వి—ఛీ. ఎండకి నీకళ్ళు పచ్చులుకమ్మి ఉంటాయి. ఒకవేళ స్థావరకుణ్ణి చూపి జడుసుగున్నావేమో!

శ—అల్లానా! ఒరే అబ్బాయీ స్థావరకా! నువ్వు మామూలుగా ఉన్నావా, రాక్షసిలా కనిపిస్తున్నావా ?

స్థా—చాలా సేపట్నుంచి ఇల్లానే ఉంటున్నాను.

శ—అబ్బా! అయితే సరే. బావా! బండిలో ఉన్నది ఒక స్త్రీఅని నా అనుమానం. నువ్ చూసి స్థిర పరుచు.

వి—(చూసి) ఔర! (అని ముక్కుమీద వేలువేసుకుంటాడు. శకారుడు అది గమనించకుండా R F దగ్గిరికొచ్చి నిలబడతాడు. వసంతసేన విటుడికి దణ్ణం పెడుతుంది).

—(సరే, భయపడకు, వీణ్ణి దగాచేస్తాలే అన్నట్టు వసంతసేనకి సంజ్ఞ చేస్తాడు).

—(శకారుణ్ణి సమీపించి) కాణేలీమాతృకా! రాక్షసే సుమీ బండిలో వ్యక్తి!

శ—నే నల్లా మొదట అనుకున్నాను.

వి—ఇప్పుడు?

శ—అనుకోటంలేదు. ఆవ్యక్తి రాక్షసికాదు.

వి—ఏం?

శ—దొంగతనం ఏమీ కనపట్టంలేదుగనక!

వి—ఏడిసినట్టేఉంది. దొంగకానప్పుడు దొంగతనం ఎల్లా కనపడుతుందీ?

శ—అందుకనే దొంగకాదు. అయితే రాక్షసత్వమే కనపడేది.

వి—ఆవ్యక్తి ఏదీకాదుగనక, మనం పోదాం, రా.

శ—నడిస్తా?

వి—అవును.

శ—నే నడవను.

వి—మరి ఏంచేస్తావ్?

శ—ఈ బండెక్కుతాను.

వి—ఎక్కి?

శ—ఎక్కి వెడతాను.

వి—ఎక్కడికి?

శ—వసంతసేనదగ్గిరికి.

వి—ఓరి పశువా! బండిలో ఉన్నది వసంతసేనే. నీకోసం వచ్చింది. ఇంటికొచ్చేస్తుంది. ముందు మనం వెళదాం, రా!

శ—నాకోసమేనా, బావా, నాకోసమే. నేను గొప్ప నరమానవ మనుష్య పురుషుణ్ణని కనిపెట్టే వచ్చిందా?

వి—అయ్యిఉంటుంది.

శ—అదే నిజం అయితే, నేను దాని పాదాలకి మొక్కుతాను.

వి—అంతేచెయ్యాలి.

శ—(వసంతసేన వేపుకివెళ్ళి సాష్టాంగపడుతూ) అమ్మా తల్లీ వసంతసేనా, నమస్కారం! (అని లేచి) నేను నిన్ను మోహించాను! (అని కళ్ళు మూసుగుని మోకరించి ఉంటాడు)

వసం—(L M నించి వచ్చి శకారుణ్ణి తన్ని) ఛీ! మూర్ఖశిఖామణీ!

శ—(తన్ను వులుపుగుంటూ లేచి) ఒరీ! కుమారా స్థావరకా! నీ కీవ్యక్తి ఎక్కడ దొరికిందిరా?

స్థా—నే వచ్చేదార్లో, ఎవరిదో బండీకి ఓచక్రం ఊడిపోతే, ఆచక్రం అమిర్చి పెట్టడానికి వాళ్ళకి సాయం వెళ్ళబోతూ

శ—ఊఁ. త్వరగా చెప్పూ.

స్థా—వెళ్ళబోతూ, ఈబండి చారుదత్తుడిగారి స్థలం పక్క పెట్టి, వెళ్ళి, వచ్చి, తోలుకొచ్చాను. ఈలోపులో ఈవిడగారు ఈబండే తమరి బండి అనుకుని ఇందులో ఎక్కింది కాబోలు. నే నీసంగతి ఎరగనే ఎరగనూ.

శ—ఓహో! అల్లాచెప్పూ. బళ్ళు మారుగిళ్ళయి రానడమా ఇక్కడికీ! అంతేగాని, నాకోసం బయల్దేరి రాలేదన్నమాటా! సరి సరి. ఈపాటి-బండి దిగు, దిగు బండీ!

వి—దిగి చాలాసేపైంది.

శ—ఆమాట నాతో చెప్పవేం బావా!

వసం—(వెళ్ళి L F దగ్గిర నుంచుంటుంది).

శ—ఒరీ! విటుడుబావా! నువ్వు గొప్పవాడివి కావాలని నీ కుందా?

వి—ఆ. ఉంటే?

శ—నేచెప్పింది చెయ్యి.

వి—వాడుపని కాకపోతే చేస్తాను.

శ—పాడుపని ఎంతమాత్రమూకాదు, చచ్చినా కాదు.

వి—అయితే చెప్పు.

శ—తెలిసేట్టె చెప్పేస్తాను, స్పష్టంగా !

వి—అయితే చెప్పు.

శ—దీన్ని చంపు.

వి—(చెవులు మూసుగుని) హర హర ! పరలోకం తరించగలనా ?

శ—అదా ! పరలోకం తరించడానికి నీకు మంచి పడవ చెయించి నే యిస్తానుగా ! చంపేద్దూ, ఇక్కడ ఎవడు చూడొచ్చాడూ !

వి—భూమీ ఆకాశమూ ఇవన్నీ లేవ్రూ ?

శ—ఉంటేంరా ? ముసుగేసి చంపరా, చవటా.

వి—ఇటువంటి ఆలోచన్లతో నాశనం కాను ! అధర్మం.

శ—ఛీ. నువ్వు పిరికిపందవ్. అబ్బాయి, కుమారా, స్థావరకా !

స్థా—ఏమి సెలవు ?

శ—నీకు బంగారు మురుగు లిస్తాను.

స్థా—ధరిస్తాను.

శ—నీకు బంగారు పీట చెయిస్తాను.

స్థా—కూచుంటాను.

శ—నేను తినగా మిగిలింది నీ కిస్తాను.

స్థా—తినేస్తాను.

శ—నిన్ను గొప్పవాణ్ణి చేస్తాను.

స్థా—అవుతాను.

శ—అయితే, నామాటవిను.

స్థా—వింటాను.

శ—చెబుతాను.

స్థా—చెప్పండి.

శ—వసంతసేనని చంపు.

స్థా—చిత్తం. నాచేతకాదు.

శ—అరే! నామాట వినవూ? నువ్వు నా పరిచారకుడవు కావూ?

స్థా—మీ పరిచారకుణ్ణే. నాశరీరం మీ బానిసకాని నాశీలం మీ బానిసకాదు.

శ—అయితే దాన్ని చంపవేం? (అని తన్ని) చంపవుట్రా? (అని మళ్ళీ తన్నుతాడు)

స్థా—నా శరీరాన్ని తన్ను, పొడు, చంపు. నువ్వు చెప్పిన తప్పుడుపని నేను చెయ్యను, తలవను.

వసం—అయ్యో! శరణు శరణు! కటాక్షించి రక్షించండి.

శ—ఒరే! చవటపుత్రాధమా! సేవకాధమా! స్థావరకా! దయచెయ్! పోయిపడుకో!

స్థా—చిత్తం (అని, L F కి పోతాడు).

శ—ఒసీ, వసంతసేనా! ఇక, నేను చంపబోతు న్నాను, నిన్ను. సిద్ధం అవు.

వి—నువ్వు స్త్రీహత్య చెయ్యడం నా ఎదట నేట్రా! (అని శకారుడి కంఠం పట్టుగుంటాడు).

శ—(నేలమీద పడి) బావా! నన్ను చంపుతావా? వొదులు! ఆగుమరీ! నా యెత్తు నువ్వు తెలుసుకోలేదు. దాన్ని వలలో వేసుగోవాలని నా బెదిరింపు.

వి—(శకారుణ్ణి విడిచిపెట్టి ఎడంగా నుంచుంటాడు).

శ—బావా! నువ్వున్నావని నాతో వ్యవహరించ డానికి ఇది మొహమాట పడుతోంది. నువ్వు వెళ్ళు. మళ్ళీ, స్థావరకుణ్ణి తీసుగురా, వాడు పారిపోయాడు.

వి—సరే (అని, L F కి పోతూ) వీణ్ణి నమ్మకూడదు. చాటున నక్కి కనిపెడతా. (అని వెడతాడు).

శ—(వేషం సర్దుకుని, మీసందువ్వి, పువ్వులు అలంకరించుగుని) హా, నా వసంతసేనా! ఓసిబాలా, బేలా, గోలా! ఇలా రావేలా!

వసం—(కదలదు, అటుచూడదు).

శ—నీకు బంగారం ఇస్తానే!

వసం—విసర్జించేవాళ్ళకి ఇయ్యడం వ్యర్థం.

శ—నేను బాగా మాట్లాడగల్నే !

వసం—వింటూనే ఉన్నాను.

శ—నీకాళ్ళమీద పడతానే !

వసం—కాళ్ళు నడక్కోవాలి.

శ—నీకు సేవచేస్తానే !

వసం—నీ సేవ పొందినవాళ్ళకి పుట్టగతులుండవు.

శ—నీమనస్సులో చారుదత్తుణ్ణి గురించి ఆలోచన మాన్తావా మానవా ?

వసం—మానను. మామిడిచెట్టుని మానుకుని మోదుగుచెట్టునా ఆశ్రయించడం !

శ—ఏమన్నావ్ ? నేనా మోదుగుచెట్టుని ! ఆ దరిద్ర చారుదత్తుడా మామిడిచెట్టు ! చంపేస్తాను జాగ్రత్త ! మనస్సులోనే కాకుండా పైకిగూడా వాణ్ణి నాఎదట స్మరిస్తున్నావే !

వసం—హృదయంలో సంగతి పైకి వచ్చితీరుతుంది. చారుదత్తుడు నా హృదయంలో ఉన్నాడు.

శ—అయితే కాస్కో. నిన్నూ వాణ్ణీకూడా ఒక్క దెబ్బని చంపేస్తాను. వెనక చాణక్యుడు సీతని చంపేశాడు, జటాయువు ద్రౌపదిని ఎగరగొట్టేశాడు. నేటికి శకారుడు నిన్ను చంపగలుగుతున్నాడు.

వసం—అయ్యో దైవమా ! హాతల్లీ ! చారుదత్త భట్టారకా ! నా అంత్య నమస్కారం !

శ——మళ్ళీ వాడిస్మరణే! (అని గొంతుక పట్టు కుంటాడు)

వసం——చారుదత్తా!

శ——(మరీ గట్టిగా పిసుకుతూ) అయితే, చావవే, చావు!

వసం——(నేలమీద పడిపోతుంది)

శ——(R F కేసి తప్పుకుంటాడు).

విటుడు——(L F నించి రాబోతూ) అయ్యోయ్యో! ఇక్కడ ఒక చెట్టు కూలడంచేత ఒక స్త్రీ చచ్చిపోయింది. ఎంత పాడుశకునమో! వసంతసేన ఏమైందో! స్థావరకా, రారా. (L F కి వచ్చి) కాణేలీమాతృకా!

శ——(R F ఇవతలకి వస్తాడు)

వి——ఇదుగో స్థావరకుడు.

శ——మంచిది.

వి——ఏదీ వసంతసేన?

శ——పోయింది.

వి——ఎక్కడికి?

శ——నీతోటే.

వి——నే పోయిన శ్రేణికి ఆమె రాలేదే?

శ——నువ్వే శ్రేణికి వెళ్ళావు చెబుదూ, ముందూ.

వి——నేను ఉత్తరంగా పోయాను.

శ——కాబట్టి, అది దక్షిణంగా పోయింది.

వి—ఊరికే అన్నాను. సేన పోయింది దక్షిణంగానే!

శ—అల్లాగైతే, అదే ఉత్తరం.

వి—నాకు సందేహంగా ఉంది. నిజం చెప్పు.

శ—నిజంగా చెబుతోన్నాను, నీ నెత్తిమీద నా కాళ్ళు పెట్టినంత ఒట్టుగా నిజం. దాన్ని చంపేశాను.

వి—హారి కర్కోటకుడా! నిజమేనా?

శ—(గర్వంతో) నమ్మకం లేకపోతే, చూస్కోరా బావా!

వి—(చూసి) అయ్యోయ్యో!

స్థా—(తనలో) నేనేగదా ఈ హత్యకి మొదటి కారకుణ్ణి.

వి—(తనలో) ఈపాపి ఈహత్య నామీదికి తోసెయ్య గలడు. పోతాను (అని L F వెళ్ళిపోడానికి యత్నిస్తాడు).

శ—(విటుణ్ణి వెళ్ళనియ్యకుండా పట్టుగుంటాడు)

వి—ఓరి పాపీ, నన్ను వొదల్రా!

శ—వదలడం ఎల్లారా! నువ్వు వసంతసేనని చంపేసి, ఆనేరం నామీద రుద్ది పారిపోతావా!

వి—ఛీ నోరుముయ్, శనీ!

శ—(బతిమాలుకుంటూ) ఇదివరదాకా నా ధనం పంచుగు తింటున్నావ్, ఇప్పుడు నా పాపంగుడా కొంచెం పంచుగోరా అబ్బా!

వి—ఛీ. పాపంఅంతా నువ్వే జుట్టుకోరా. (అని వెళ్ళబోతాడు)

శ—ఎక్కడికి పోతావురా? రా, మా బావదగ్గిరికి!

వి—ఛీ కుక్కా, గాడిదా! (అని కత్తితీస్తాడు)

శ—(భయపడిపోతూ) ఓరి! నన్నుచూసి భయపడ్డావా ఏమిటిరా! అయితే సరేలే. క్షమించాను. వెళ్ళిపో.

వి—(తనలో) చావుదాకా వస్తే క్షమిస్తావు. నేను శర్విలక చందనకుల్ని కలుసుగోవాలి. (అని L F కి పరిగెట్టి పోతాడు).

శ—ఒరి! స్థావరకా! నేనిప్పుడేం జేశానో చెప్పు.

స్థా—ఛండాల దెయ్యాపుగొడ్డు పనిచేశారు.

శ—భేష్. నిజంచెప్పావు. పోన్లే, ఈ నగలు తీసుకో.

స్థా—నాకు నగలెందుకండీ! వద్దు వద్దు. ఉంచండి. ఆనగలకి మీదగ్గిరే రాణింపు.

శ—సరే. బండి తోలుకుపోయి నా మేడదగ్గి రుండు.

స్థా—(L M కి పోతాడు).

శ—ఆఁ. తెలిసింది. అపవాదు తప్పించుగునే టందుకు విటుడుబావ దాటిపోయాడు. వాడి చిక్కుండడు. ఈ స్థావరకుణ్ణి ఇంటికెళ్ళడంతోటే సంకెళ్ళు వేసేసి మేడగదులోపెట్టి తాళం వేసేస్తాను. (వసంతసేనని సమీపిస్తూ) ఇది చచ్చిందా లేదా? (చూసి) ఓ. ఒకటోరకంగా చచ్చిపోయింది. ఈ శవంమీద నా కండువా కప్పితే నాపేరు పోల్చుగుంటారు. పోనీ, ఈ ఎండుటాకులు కప్పుతాను. (అని కప్పుతాడు). మరి పోతాను. అడుగో, ఇందాకా

నే తన్నిన సన్యాసికుణ్ణా వస్తున్నాడు. (అని, సంతోషంతో, చప్పుడు లేకుండా RF కి పోతాడు)

[సన్యాసి RM నించి ప్రవేశిస్తాడు. తడిబట్టవిప్పి చాపుగా చేసి పరవడానికి స్థలంకోసం చూస్తాడు]

స—ఈ, తడిబట్ట చెట్లకొమ్మలకి ఆరకడితే కోతులు చింపేస్తాయి. నేలమీద పరిస్తే దుమ్ము, (ఆకుల పోగుచూసి) ఇక్కడ ఎండుటాకులు గాలికి పోగు పడ్డట్టున్నాయి. వీటిమీద పరుస్తాను (అని, అట్లాచేసి, వాటిపక్క, ఎదర, కూచుని) బుద్ధదేవా, నమస్కారం. ఈ జన్మలో నాకు ఒక్క ఋణం మిగిలి ఉంది. అదేమిటంటే, వసంతసేనకి యథాశక్తి ప్రత్యుపకారం చెయ్యడం. ద్యూతజన్మనించి నన్ను రక్షించింది, ఆమేకదా! (ఆకులు గలగల లాడినట్లు కాగా ఆ వైపుచూసి) — గాలికి గావును ఎండుటాకులు గలగల లాడుతున్నాయి (మళ్లీచూచి) కాదు, చెయ్యి, ఆఁ, అలంకార భూషితమైన స్త్రీ హస్తము — అవిగో చేతులు — ఆ చేతులేమో! ఓహో, ఆ చేతులే, నన్ను రక్షించిన చేతులే!

వసం—(నీళ్ళు కావాలన్నట్టు సంజ్ఞ చేస్తుంది)

స—అయ్యో! ఈవిడికి నీళ్ళు కావాలి, చేరువలో బావిలేదు. సరే, ప్రస్తుతం (అని, తడివస్త్రం ఆవిడ మీద కప్పుతాడు)

వసం—(తెలివి తెచ్చుగుని) ఆర్యా, మీరెవరు?

స—అమ్మా! నేను పూర్వం సంవాహకుడనే జూద గాణ్ణి, మీరు రక్షించారు నన్ను, మఱిచిపోయారు.

వసం—ఓహో! మీరా! అయ్యో! నేను చచ్చిపోయుంటేనే బాగుండేది.

స—ఏమి ఆపద వచ్చిందమ్మా, మీకూ?

వసం—ఏముందీ, వేశ్యాజన్మకి ఫలం!

స—భయం లేదు. ఈ కొమ్మ పట్టుగుని లెండి

వసం—(లేస్తుంది)

స—అమ్మా, రా, నీవు యువతివి నేను సన్యాసిని, అయినా, ప్రాణరక్షణ అధర్మం అనే మానవుడుంటాడా? రండి, (అని RM కేసి మెల్లిగా నడిపించు కుంటూ వెడతాడు)



## రంగం-8

(రాచకార్య మండపం)

[అధికరణికుడు కూచునే టందుకు ఒక ఉన్నతాసనం సిద్ధంగా ఉంటుంది. నడుంకట్టుగుని, శోధనకుడు సేవించడానికి ఉంటాడు. కింది కుర్చీలమీద కాయస్థుడూ, శ్రేష్ఠీ కూచుని ఉంటారు. శోధనకుడు, "ఏయ్, సద్దు, సద్దు" అని కేక వేసే సరికి అంతా నుంచుంటారు. RM నించి దండనాధికారి దుస్తుల్లో అధికరణికుడు ఠీవిగా వచ్చి కూచుంటాడు. కాయస్థుడు కొన్ని పత్రాలూ రెల్లుకలమూ అధికరణికుడి ఎదట పెట్టివచ్చి కింద నిలబడతాడు. శోధనకుడు RM కేసి నిలబడతాడు.]

అ—శోధనకా! బయటకూర్చున్న వ్యవహారాల వాళ్ళని ప్రవేశపెట్టు – ఒక్కొక్కరినే!

శో—చిత్తం ప్రభూ! (RF కేసి నడిచి) ఏయ్! రావయ్యా! వచ్చి వ్యవహారం ఏదేనా చెప్పగుంటావా?

శ—ఆ ఆ, (అంటూ RF కి వస్తాడు)

శో—నువ్వెవరు?

శ—నేను ఒక గొప్పవాణ్ణీ రాజస్యాలకుణ్ణికూడానూ! నాపేరు శకారుడుగారు.

శో—అయినా సరే, ఆ పక్కనుండు, చెప్పివస్తాను, (అని, సింహాసనం సమీపించి) ప్రభూ! రాజ్యస్యాలకుడట! శకారుడట.

ఆ—మొదట్లోనే వీడా! 'చాలా తొందరపను లున్నాయి, ఈ వేళ ఏ వ్యవహారం కుదరదు' అని అధి కారుల సెలవు — అని చెప్పు.

శో—(R F దగ్గిరికి వెళ్ళి) ఏమండోయ్! 'చాలా తొందరపను లున్నాయి. ఈవేళ ఏ వ్యవహారం కుదరదు' అని ప్రభువుల సెలవైంది.

శ—అల్లాగా! నావ్యవహారం వినడానికి ఈవేళ తీరుబడి లేదేం? సరే కాన్యండి. మీపని పట్టిస్తా నుండండి. మా అక్కతోనూ మా బావతోనూ మా అమ్మ తోటీ మా బామ్మతోటీకూడా చెప్పి, ఈ అధికరణికుణ్ణి ఊడ పీకించి గోతులో ఊరదొక్కించి, మరోణ్ణి కేవనెత్తి ఈస్థానంలో మేకుబందీ చెయించి, ఆ కొత్తవాడితో నావ్యవహారం చెప్పుగుంటాను. (అని బెదిరిస్తూ వెళ్ళిపోబో తాడు)

శో—అయ్యో! తమరు ఒక్కక్షణం ఆగండి. శ్రీవారితో మనవిచేసి వస్తాను. (అని వెళ్ళి ప్రభువుతో) ప్రభూ! ఆ రాజస్యాలకుడు చాలా కోప్పడి శ్రీవారి పదవి గురించికూడా బెదిరిస్తున్నాడు.

ఆ—నా పదవిగురించే! ఓయిబాబో! వాడు ఏమి చేసినా చెయ్యగలడు. అయితే, ఆ దిక్కుమాలాణ్ణి రమ్మను.

శో—(R F కి వెళ్ళి) అయ్యా, రండి. మీ వ్యవ హారమే ఆలోచిస్తాం అని ప్రభువు అన్నారు.

శ—(గర్వంగా వస్తూ) ప్రభూ! మాకు జయమగుగాక !

ఆ—(తనలో) ఔర ! స్వంత వ్యవహారంగురించి వచ్చినవాడికి ఉండవలిసిన స్వాతిశయమేనా ఇది! (పైకి) ఆం. రావయ్యా, రా !

శ—భూమి అంతా నాదే! నా యిష్టంవచ్చినచోట కూర్చుంటాను. (అని నేలమీద కూచుంటాడు)

ఆ—లేచి సరిగా నిలబడి నీ వ్యవహారం ఏమిటో చెప్పు.

శ—(లేచి) ప్రభూ! నేను పెద్దవంశంలోవాణ్ణి గనక నున్నూ, పైగా మా అక్కభర్త రాజుగనకనున్నూ, రాజు స్వయానా మానాన్నకి కాసాగా అల్లుడు గనకనున్నూ, నేను రాజుకి అచ్చంగా బావమరిదిని గనకనున్నూ...

ఆ—అబ్బ! నీ కారణాలతోరణాలు చాలు. అయితే ఏమంటావ్ ?

శ—ఏమంటానూ ! నావ్యవహారం మీచెవులో చెబుతా నంటాను.

ఆ—సరే. నా చెవితోనే వింటాను. ఏమిటి సంగతి?

శ—సంగతేనా ! దాచడం ఎందుకు చెప్తేస్తున్నాను వినండి. అనగనగా రాజు ఆరాజు నాకు బావ. ఆబావ నాకు తోటయిచ్చాడు. ఆతోట ఎండుది. అక్కడికి నేను తిరడవడానికీ దాసికి వెసుతూంటాను. అక్కడ నాకు ఒక స్త్రీ కనపడలేదు, అనగా ఒక స్త్రీ శవం కనపడింది.

ఆ—అట్లానా ! నువ్వాస్త్రీని ఎరుగుదువా ?

శ—ఆస్త్రీనా౦క ! చాలాకాలంనుంచి ఎరుగుదును. ఈ పట్టణంలో ఆవిణ్ణి ఎరగనివాళ్ళు లేరు.

ఆ—ఆవిడపేరు ?

శ—వసంతసేన. ఆ వసంతసేనని డబ్బుకోసం ఒక దుర్మార్గుడు మెడపిసికి చంపేశాడు. మీరు గ్రహించారో లేదో...ఏది...నేను...కాదు, నేనే...

ఆ—కాయస్థా ! "నేను కాదు, నేనే" అనేమాటలు రాసి, గుర్తించు.

శ—ప్రభూ! అంతమాత్రానికి, అట్టహాసం చెయ్యకండి. దాన్ని మొదట 'నేను చూశాను' అనబోయి, తరవాత 'నేనే చూశాను' అనదల్చి అల్లా అన్నాను. ఈ సంగతి కూడా గుర్తించి రాయండి (శ్రీ)వారు.

ఆ—డబ్బుకోసం మెడపిసికారని నీకెట్లా తెలుసూ ?

శ—మెడ వాచింది, ఆభరణాలు లేవు.

శ్రే—ఈమాట సబబుగానే ఉన్నది. (అధికరణికుడితో) ప్రభూ ! ఏమిసెలవు ?

ఆ—ఇప్పుడు వ్యవహారం రెండుభాగాలు.

శ్రే—చిత్తం.

ఆ—వాక్యభాగం, అర్థభాగం. వాక్యభాగంలో వాది నోటినిబట్టి పోవాలి, అర్థభాగంలో తీర్పరి బుద్ధినిబట్టి పోవాలి.

శ్రే—శ్రభువ్రుల కటాక్షం. ప్రస్తుతం వాక్యభాగాన్ని అనుసరిస్తే వసంతసేనయొక్క ముఖ్యబంధువులూ, స్నేహితులూ ఇప్పుడు ఉండాలి.

అ—అవును. శోధనకా! నీవు సత్వరము వెళ్ళి—ఇట్లారా! (అని చెవిలో మాట్లాడి)-సమాధాన మడిగి, రా.

శో—చిత్తం. (అని RF కి పోతాడు)

అ—శకారా! ఆ స్త్రీని చంపినవారు ఎవరు ?

శ—(కొంచెం ఆగి) ఎవడో! ఎవడో గొప్పవాడే అయి ఉండాలి, ప్రభూ!

అ—ఎందువల్లా ?

శ—కొద్దివాడు ఆవిణ్ణి సమీపించనే లేడు.

అ—ఆసంగతి నీకెటు తెలిసిందీ ?

శ—పూర్వవాసన వల్లా, వినికిడివల్లా,

అ—సరే, ఆ చంపినవాడు ఆవిడ మెడ నులిమేటప్పుడు నువ్వు కళ్ళతో చూస్తూ నుంచున్నావా ?

శ—ప్రభూ! వాణ్ణి నేను చూస్తూ ఉండడం జరిగితే, వాణ్ణి నేనే చంపేసి ఉండే వాణ్ణి.

అ—నీదంతా ఊహ అన్నమాట.

శ—అవునండి, అయితేం ? నా ఊహ నాకు మల్లేనే అసాధారణం అండి. అనగా ప్రత్యక్షంతో సరి సమానమైన ఊహ.

శో—(RF నించి ప్రవేశించి, అధికరణికుడు దగ్గిరికి వెళ్ళి ఏదో రహస్యముగ చెబుతాడు. అధికరణికుడు మళ్ళీ

ఏదో శోధనశక్తితో చెబుతాడు. శోధనకుడు సింహాసనానికి కైవారం చేసి మళ్ళీ RF నించి పోతాడు)

ఆ—సరే. నీ ఊహ గొప్పదే, అయితే, శకారా! ఆ స్త్రీ మొహం చూసిందన్నావు, మొహంమీాది నరాలు పొంగి ఉన్నాయా? నేత్రాలెట్లా ఉన్నాయి? నాలిక బయటికి వచ్చిందా?

శ—దేవరవారు విడివిడిగ ప్రశ్నలడగడం న్యాయం. అందులోనూ, ప్రశ్న ముఖ్యమైన దైనప్పుడు వాదిని తొందర పెట్టకుండా వ్యవధి ఇవ్వడం కూడా ధర్మమే.

ఆ—ఓహో! న్యాయ ధర్మాలమీాద నీకు చాలా ప్రేమలా ఉందే! కానీ, నెమ్మదిగా చెప్పు. ఒక టొకటే చెప్పు, ఆమె మొహంమీాది నరాలు పొంగి ఉన్నాయా?

శ—అప్పట్లో ఏమోమరి! ఇప్పుడు ముఖాన్నంతనీ జుట్టు కప్పేసింది.

ఆ—సరి, ఆమె నేత్రా లెట్లా ఉన్నాయీ?

శ—కళ్ళాండీ, కళ్ళు బొత్తిగా కనిపించటం లేదు. మూసుకు పోయాయి.

ఆ—సరే, నాలుక బయటి కొచ్చిందా?

శ—నేను తిన్నగా చూడలేదండి, అసలు నా నాలికే నాకు భయం.

శో—(R F నించి ముందు వచ్చి, వెనకాలే చారు దత్తుడు వస్తూండగా) ప్రభూ! ఈయనే చారుదత్తుడు!

చా—(సింహాసనానికి నమస్కరిస్తాడు).

ఆ—శ్లోకా! ఆర్య చారుదత్తుడికి పీఠం తెచ్చి వెయ్యి.

శ్లో—(L M నించి కుర్చీ తెచ్చి వేస్తాడు)

చా—(కూర్చుంటాడు),

ఆ—ఆర్యా! నీకు వసంతసేనతో స్నేహమా?

చా—(సిగ్గుపడడం అభినయిస్తాడు)

ఆ—సిగ్గుపడి లాభంలేదు. వ్యవహారంగదా! చెప్పి తీరాలి.

చా—నాకు వసంతసేనతో స్నేహమే. ఉండ కూడదా?

ఆ—ఆమె ఇప్పు డెక్కడుంది?

చా—వాళ్ళ యింటికి వెళ్ళింది.

శ్రే—ఎప్పుడు వెళ్ళింది? ఎవరితో వెళ్ళింది? ఎట్లా వెళ్ళింది?

చా—(ఊరుకుంటాడు)

శ్రే—త్వరగా చెప్పు.

చా—అయ్యా! వాళ్ళయింటికి వెళ్ళింది. ఇంకా ఏం చెప్పమన్నారు?

ఆ—ఇప్పు డావిడ తన యింటిదగ్గిర లేనట్టూ, నీతో ఉండవలిసినట్టూ, అధికారరీత్యా మాకు తెలిసిందే!

చా—ప్రభూ! ఆసంగతి నే నెరగను.

శ—(సందర్భం దొరకపుచ్చుగుని) నువ్వు ఎరక్క-పోడం ఏమిట్రా! దాని నగలకోసం దాన్ని మెడపిసిగి చంపి, నా వెుండుతోటలో శవాన్ని పారేశావ్రా ! నువ్వురా ఆసంగతి ఎరక్క-పోడమూ !

చా—ప్రభూ ! ఇతడిది కుళ్ళునోరు.

అ—అవును. చారుదత్తుడు ఇంత దారుణం చేస్తాడా?

శ—ప్రభూ ! జరిగిన యథార్థం తమరు అన్వేషించాలిగాని, మీకు నచ్చని విధంగా జరిగిన దాన్ని అయథార్థం అని కొట్టిపారెయ్యకూడదు.

అ—చాలు. మీరు మరి నోరుమూసుకుని, నిశ్శబ్దంగా ఉండండి. అడగనప్పుడు నోరు మెదపకండి. (చారుదత్తుడితో) ఏమయ్యా !...

—వసంతసేన మీ యింటినించి బండెక్కి- వెళ్ళిందా, నడచి వెళ్ళిందా ?

చా—ఆమె, వెళ్ళడం అనేది నా సమక్షంలో జరగ లేదు.

[వీరకుడు తొందరగా RF నించి ప్రవేశిస్తాడు].

వీ—(అధికారితో) స్వామీ, దండాలు.

అ—తలారీ, వీరకా ! ఏమిరా విశేషమూ ?

వీ—ప్రభూ ! గోపాల దారకుడు చెరసాల్లోంచి దాటుకొన్నాడు.

అ—అరే, మీరేమి చేశారు ?

వీ—అణ్ణి నేనూ చందనకుడూ ఎనికాం, ఆపు కాపన్లేము. ఓ బండొచ్చింది. మొదట చందనకుడు లోనికి చూశాడు. నేనుకూడా సూత్తానంటె ఒల్లక, నన్ను తన్ని తోసేశాడండి.

ఆ—ఆబండి ఎవరిదో కనుక్కున్నారా ?

వీ—సిత్తం. చారుదత్తుడు గారిదే అని బండో డన్నాడు.

ఆ—అందులో ఎవరున్నారన్నాడు బండివాడూ ?

వీ—వసంతసేన ఉందన్నాడండి, ప్రభూ,

ఆ—సరే, బండి ఎక్కడికి వెడుతుందన్నాడూ?

వీ—పూలతోటలోకి ఎల్తుందన్నాడు ప్రభూ.

శ—అయ్యల్లారా అమ్మల్లారా, వినండి వినండి. ఈ మాటె నే చెప్పింది. నిదర్శనం ఎల్లా వచ్చిందో చూడండి.

ఆ—వీరకా ! నీకూ చందనకుడికీ జరిగిన దెబ్బలాట గురించి తరవాత విచారిద్దాం. ఈ భవనద్వారందగ్గిర గుర్రం ఉంది. మొదట నువ్వు దానిమీద వెళ్ళి ఆ ఎండు తోటలో ఆడశవం ఏదేనా ఉందేమో చూసి, రా.

వీ—కటాక్షం. (అని R F కి పోతాడు).

ఆ—మంచిది. శకారా ! నువ్వు చూసేటప్పటికే ఆశవం శిథిలమై ఉందా ?

శ—ఆ అమ్మాయిరూపం చాలా గొప్పది. ఆ అందం ఎక్కడండీ ప్రభూ !

ఆ—అందంమాట సరేలే. నువ్వన్న తీరం రూప వికారం ఏమాత్రం కలిగించదే?

శ—అయ్యో! ఎంతైనా అందమే!

ఆ—నక్కలు ఆ శవాన్ని పీక్కుతిన్నాయా?

శ—నక్కలు పీక్కుతిన్నా ఆ అందం పోయేది కాదండి.

ఆ—మూర్ఖా! సరియైన సమాధానం చెప్పు. శవాన్ని నక్కలు పీక్కుతిన్నట్టు తెలుస్తుందా?

శ—ప్రభూ! నక్కలకి మాంసం సయిస్తుందిగాని; అందం సయించదు.

ఆ—ఓరి మూర్ఖాగ్రేసరా! అడిగేది చెప్పడు. ఈ శవం ఫలానా వ్యక్తిదీ అని గుర్తుపట్టి పోల్చుకోడానికి వీలుందా?

శ—ఆ, వీలుంది ప్రభూ.

ఆ—మరి నక్కలు తిన్నాయన్నావేం?

శ—అనలేదండి. ఒక నక్కని నేను తొక్కిరావడం వల్ల నక్కసంగతి నాకు జ్ఞాపకం వచ్చింది. ఈ శవాన్నికూడా నక్కలు తినివుంటే తినివుండచ్చు.

వీ—(R F నించి గబగబావచ్చి) ప్రభూ! అక్కడ శవంఉంది. దాన్ని నక్కలు పీక్కుతిన్నాయి. దీర్ఘమైన తలకట్టువల్ల ఆడదని తెలుస్తుంది.

శ——హోరా! వ్యాపారం చాల కాక్షీఅయిపోతోంది! చారుదత్తా! నిజం చెప్పు.

చా——ప్రభూ! పుష్పం కోసుకోవడానికి చెట్టును వంచితే చెట్టు శ్రమపడుతుందేమో అని బాధపడుతూండే నేను నరహత్య చేయగలనా? పైగా స్త్రీహత్య? అందులోనూ వసంతసేననా? (అని చెవులు మూసుకుని) ప్రభూ! నిజంగా నేనేమీ ఎరగను.

శ——ప్రభూ! ఇకనైనా పక్షపాతం మాని, అతణ్ణి పీఠంమీంచి దించి కింద కూచోబెట్టండి.

(అధికరణికుడు శోధనకుడికి సంజ్ఞ చెయ్యగా, వాడు వెళ్ళి చారుదత్తుణ్ణి కింద కూచోమని చెప్పగా, చారుదత్తుడు కింద కూచుంటాడు)

శ——(కిందనించి లేచివెళ్ళి చారుదత్తుడి పీఠంమీద నవ్వుతూ కూచుని) ఒరే చారుదత్తా! చూడు నా కేసీ! చూశావా నా గొప్ప! ఇప్పుడైనా ఒప్పుకో నీతప్పు! చెప్పు వసంతసేనని చంపానని. ప్రభువు క్షమిస్తారు.

చా——(మనసులో) అయ్యో! నాకెంత దుర్దశ పట్టింది! బంగారు ఆటబండి చెయించుకోమని నా కుర్రవాడికి తన నగలు ఒల్చి ఇచ్చివేసింది వసంతసేన! ఆ నగ లామెకిచ్చి వేసి రమ్మని మైత్రేయుణ్ణి పంపించాను. అతడు వచ్చేసినా బాగుండునుగదా!

[ చేతిక్కర్ర ఒకటి పుచ్చుకుని, చంకకింద నగలమూట పెట్టుకుని LF నించి మైత్రేయుడు వస్తాడు ].

మై—ప్రభువులవారు క్షమించాలి. ఇక్కడగాని నా చారుదత్త మిత్రుడున్నాడాండీ ?

శో—ఆ. ప్రభూ, నిన్ను తోసెయ్యనా !

శ—తోసెయ్ ! గెంటెయ్ !

అ—వద్దు. (మైత్రేయుడితో) ఆ. ఉన్నాడు.

మై—క్షమించండి. (చారుదత్తుణ్ణిచూసి) మిత్రమా! ఇదేమయ్యా, ఇట్లా రచ్చకెక్కావేం ?

చా—ఏమనుకుంటావు మిత్రమా! ధననిమిత్తం, నేను, ఒక స్త్రీని, రతీదేవివంటిదానిని,

మై—ఆఁ ఆఁ.

చా—(మైత్రేయుణ్ణి దగ్గిరికి రమ్మని చెవులో మాట్లాడతాడు)

మై—ఎవడూ ఆ. అన్నవంటా ?

చా—(శకారుణ్ణి చూపిస్తాడు.)

మై—తన యింటికెళ్ళిపోయింది వసంతసేన అని చెప్పకపోయావుటయ్యా, వెర్రివాడా !

చా—అట్లానే చెప్పిచూశాను. వీళ్ళకి నమ్మకం లేదు.

మై—ప్రభూ ! నాకితడు ప్రాణస్నేహితుడు. నా మాట ఒకటి ఆలకించగలందుకు ప్రార్థిస్తున్నాను. జనం కోసం సత్రాలువేసీ, చెరువులు తవ్వించీ, గుళ్ళుకట్టించీ

దరిద్రుడయ్యాడు చారుదత్తుడు! ఇతడు ధనంకోసం హత్య
చేస్తాడా? (శకారుణ్ణి చూపి) ఈ బోడికొంక చెప్పడమూ,
ప్రభువులు నమ్మి సెయ్యడమూనా! ఓరి నీచజన్మా, నీచ
శిశీ, దుష్టులగాడిదా! నగలకోతీ! బంధకీపుత్రా! నువ్వు
నేనిక్కడ లేనప్పుడు అన్న పాడుమాట మళ్ళీఅను, నీబుర్ర
పచ్చడిచేస్తానో లేదో, ప్రభువులు నాబుర్ర తీయించేసినా
సరే తరవాత! (అని ఒకచేత్తో కర్ర ఎత్తుతాడు.)

శ—ప్రభువులారా వినండి. అసలు వ్యవహారం
నాకూ ఆ చారుదత్తుడికినూ! వీడికి ఇక్కడ ప్రమేయమే
లేదు. అయినా చూడండి. ఈ బ్రహ్మచారిగాడు, నాఅంతే
వాణ్ణి మాటల్తో ఎల్లా కొడుతున్నాడోనూ!

మై—ఛీ, నోరుముయ్, పశువా! కొడ్తానా కొట్టి
చూపిస్తానా! (అని కర్ర రెండుచేతులా ఎత్తుతాడు, శకా
రుడు లేస్తాడు. ఇద్దరూ కలబడబోతారు. శోధనకుడు ఆప
డానికి వెడతాడు. మైత్రేయుడి చంకలోంచి నగలమూట,
కింద పడుతుంది.)

శో—(మైత్రేయుణ్ణి ఆపుతాడు.)

శ—(నగలమూట తీసి) ప్రభూ, ఆర్యులారా!
చూడండి, నామాటనిజం. ఈ మూటలో ఉన్న నగలన్నీ,
పాపం, ఆ వసంతసేనవే. ఇవి తీసుగు నేనిమిత్తమే వాడు
(అని చారుదత్తుణ్ణి చూపి) దాన్ని గొంతుగ పిసిగేశాడు.

(అందరూ ముక్కుమీద వేలేసుగుని ఆశ్చర్యపడ
తారు. అధికరణికుడు శోధనకుణ్ణి దగ్గిరికిపిలిచి ఆమూట

విప్పమంటాడు. శోధనకుడు అదివిప్పి ఐదువేళ్ళూ చూపి స్తాడు, తరవాత ఆమూట మళ్ళీ గట్టిగాకట్టి, చేత్తో పట్టుగుని, వంగి నమస్కరించి, R F కేసి వెడతాడు.)

ఆ—శకారా !

శ—చిత్తం.

ఆ—వసంతసేనతో నీకు స్నేహమా ?

శ—లేదండి. ఉంటే ఒప్పుగోడానికి నేను సందే హించను.

ఆ—నువ్వు వసంతసేనని ఎరుగుదువా ?

శ—అంతా ఎరుగుదురండి.

ఆ—నీమాట చెప్పవోయ్ !

శ—నేను కొంచెం ఎరుగుదును.

ఆ—ఆవిడతో మాట్లాడావా ?

శ—లేదండి. పోయిందికాదూ, అందుకని వీల్లేక పోయింది.

ఆ—ఓరి మూర్ఖా ! అది కాదు. బతికున్నప్పుడే.

శ—అప్పుడా ! అప్పుడు మాట్లాడానండి.

ఆ—ఎంతదూరాన్నించి ?

శ—దూరం అట్టేలేదుగానండీ, అప్పుడు చాలా చీకటిగా ఉందండి.

ఆ—చీకటిగాఉంటే, వసంతసేన అని ఎల్లా గుర్తిం చావ్ ?

శ——ఆవిడ కంఠధ్వనిబట్టేనూ, మాబావ చెప్పడాన్ని బట్టేనూ!

ఆ——మీబావ రాజుగారు కాదూ!

శ——కాదండి. ఇది చెప్పిన బావ విటుడుబావ.

ఆ——సరే పోనీ. అంత చీకట్లో ఆవిడ వొంటిమీంది నగలు ఎల్లా చూశావ్?

శ——అబ్బే, చూడలేదండి, విన్నాను.

ఆ——నగలు వినడం ఏమిటీ?

శ——అంటే నగలచప్పుడు.

ఆ——సరే చప్పుడుమాత్రమే విన్నవాడవూ, ఇప్పుడు ఈ నగలు వసంతసేన నగలేఅని చూసి ఎల్లా చెప్పగలిగావూ?

శ——నా సూక్ష్మబుద్ధివల్ల చెప్పానండి. ఏచప్పుడయే నగలు ఎల్లా ఉంటాయో పోల్చగల్ను.

శో——(R F నించి వచ్చి, అధికరణికుడి దగ్గిరికి వెళ్ళి, నమస్కరించి, రహస్యం చెప్పి, మూటవిప్పి నగలు ప్రభువుకి చూపించి, మళ్ళీ ఆమూటకట్టి, బల్లమీదఉంచి, వెళ్ళి RM దగ్గిర నిలబడతాడు.)

ఆ——చారుదత్తా! సందేహం తీరింది. ఈ నగలు వసంతసేనవే అని ఆవిడతల్లి గుర్తుపట్టింది. చారుదత్తా! నిజం ఒప్పుకో. దండన తప్పదు.

చా——అయ్యో! నిజం. ఇవి మాయింట్లోంచి ఇతడు తెచ్చాడు. నేను అన్యాయం ఎరగను. ఏపాపమూ ఎరగను.

—చారుదత్తా!

చా—ప్రభూ!

శ—ఎంత మోసగాడవప్పా!

చా—ప్రభూ! కాదు.

అ—ఈమాటలకేమిలే. నీకు ప్రతికూలంగా ఇంత బలమైన సాక్ష్యం వచ్చిందిగనక సరిపోయిందిగాని, లేకపోతే నువ్వు యథార్థం దాచి ఉంచేవాడివే కదా!

చా—ప్రభూ! నా మనశ్శాంతికోసం నేను హత్య చేసినట్టు ఒప్పుకుంటున్నానుగాని, నేను ఏకపటమూ ఎరగను.

అ—ఊరుకో. ఇంకా అదేమాటా! ఈ నేరానికి శిక్ష మరణదండన. కాని, మనువు ధర్మమా అని నిన్ను చంపకూడదు. దేశంలోంచి బయటికి గెంటెయ్యాలి. ఒక్క క్షణంలో తీర్పు చెప్తాను. ముందు నీ స్నేహితుడిదగ్గిర సెలవు తీసుకో.

చా—చిత్తం. మైత్రేయా! మా అమ్మకి నా నమస్కారాలు చెప్పు. ధూతాదేవికి ధైర్యం చెప్పు. కుర్రాణ్ణి కనిపెట్టు.

మై—(దుఃఖంతో) ప్రాణస్నేహితుడవైన నువ్వు పోనప్పుడు, ప్రాణాలు ధరించి నేనుంటానా? ఉండనా?

చా—కుర్రవాడి నిమిత్తం ఉండు. మొదట, వాణ్ణి నాకు ఓమాటు చూపించు.

శో—(L F నించి వస్తూ నమస్కరించి, అధికరణికుడి ఎదట ఒకపత్రం పెడతాడు).

ఆ—పాలక మహారాజగారి ఆజ్ఞని అనుసరించి ఇదే తీర్పు. ఈ నగలు ఇతని మెడకి కట్టి, ఇతణ్ణి దండోరాతో ఊరంటతిప్పి, ఊరవతల శ్మశానంలో ఇతణ్ణి మెడ ఉత్తరించవలె.

మై—అయ్యో! మిత్రమా! (అని వెళ్ళి కౌగిలించుకుంటాడు).

చా—హా దైవమా! భరిస్తాను. భరించాలి. ఎవరిని ఏమని ఏంలాభం! మిత్రమా! వెళ్ళు.

ఆ—శోధనకా! ముందీ బ్రహ్మచారిని సాగనంపు.

శో—(మైత్రేయుడితో) పోవయ్యా!

మై—(దుఃఖంతో R F కి పోతాడు)

(నమస్కారం పెడుతూన్న చేతుల్తో, వంచినతలతో, చారుదత్తుడు L F కి నడుస్తూండగా, ఇటూ అటూ భటులు కాపలాకాస్తూ వెళ్ళగా, తెర.)



## రంగం-9

(రెండో తెర ఎదట-వీధి-వధ్యస్థానానికి పోయేదారి.)

[L F నించి, ఆహింత, గోహ అనే చండాలురు ఎగా పెడా నడుస్తుండగా, వాళ్ళమధ్య, సంకెళ్ళతో, మెడలో గన్నేరుదండతో, కుంకం బొట్టుతో చారుదత్తుడు వస్తాడు.]

ఆ—(పైకి చూసి) పాపం, యీన గోసకోసం ఆకాసం ఏడుస్తావుందిరా!

గో—కాదొస్ ! మేళ్ళమీది ఆడోళ్ళంతా గోలే! ఒపాలి సాటిచ్చరా, ఆహింతా!

ఆ—(సాటిస్తాడు) "అంతాయినండి యినండి. ఈ నగాగరదత్తుడి కొడుకు చారుదత్తుడు. వసంతసేన అనే బోగంకూతురు నగలు లాగేసి ఆ మడిసిని మెడపిసిగి సంపేశాడు, నగల్తోదొరికాడు. నేరం ఒప్పుగున్నాడు. ఈన మెడ నరికెయ్యాలని సిచ్చపడింది. అందరూ బుద్ధిగా ఉండండో హోయ్!

చా—నాయన్లారా! మీరు నాకు కొంచెం సాయం చెయ్యాలి.

గో—ఏటి?

చా—మాకుర్రాడు వస్తాడు. వాణ్ణి నేను చూసేటందుకు మీరు ఒప్పుగోవాలి.

గో—అట్టానే సెయ్యా! మేం మాటుసు మడుసులం కామా!

(R F నించి రోహసేనుడు వస్తూండగా)

—రా, అబ్బాయి, రా! ఇట్టా రా!

[R F నించి ముందు రోహసేనుడూ వెనకాలే మైత్రేయుడూ వస్తారు]

రో—(వెంటనే తండ్రిదగ్గిరికి వెళ్ళిపడి) అయ్యో, నాయనా!

మై—(విచారంతో) మిత్రమా! నువ్వు మళ్ళీ కనిపించవుగదా, నాకీ కళ్ళెందుకూ!

చా—అయ్యో! మిత్రుడా! అయ్యో పుత్రుడా! కాలం నా కెల్లాంటిదైందీ, పిల్లవాడి కేమియ్యను! ఈ యజ్ఞోపవీతముంది. (అని అదితీసి కుమారుడికిస్తాడు.)

ఆ—ఓరీ, చారుదత్తా, రారా.

గో—ఏరా! గోవులాంటాయన్ని ఒరే అంటా వేంరా?

రో—(కళ్ళు తుడుచుకుని) ఒరీ, చండాలుల్లారా!

గో—అట్టా అనక బ్బాయిగారు! మాకులం సెండాల కులం అంతే. మేం సెండాలులం కాం. కారణంలేందే మంచోళ్ళని ఏడిపించేవోళ్ళు సెండాలుళ్ళు.

రో—మరి మీరు మానాన్నని ఎందుకూ చంపడం?

గో—రాజుగారి సెలవు, బాబూ, మేం ఏటిసెయ్యాం?

రో—పోనీ మానాన్నని వొదిలెయ్యండి, నన్ను చంపండి.

చా—అబ్బా! ఈవాక్యం చందసమా, అగ్ని హోత్రమా?

మై—ఒరే, మీకు నమస్కారం. నా మిత్రుణ్ణి వొదిలి నను తెగెయ్యండి.

గో—కూడదయ్యా! తప్పుకో. అంతా యినండి. ఈన చాగరదత్తుడి కొడుకు చారుదత్తుడు. వసంత సేన అనే భోగంకూతురు నగలులాగేసి, ఆ మడిసిని మెడపిసిగి సంపే శాడు. నగల్తోవోరికాడు. నేరం ఒప్పగున్నాడు. ఈన మెడ నరికెయ్యాలని సిచ్చడింది. అందరూ బుద్దిగా ఉండండో హోయ్!

(R F దగ్గిర, లోపల, పైనించి కిందికి ఎవరో దూకి నట్టు దభీమని చప్పుడవుతుంది.)

స్థా—(R F నించి ఇవతలకి వచ్చి) ఆహా, ఏమి ఆశ్చర్యమూ! మేడమీదినించి కిందికి దూకినా, నేను చావలేదు సరిగదా, కాలి సంకెళ్ళుకూడా విడిపోయినాయి. ఇక గట్టిగా అరుస్తాను. ఆర్యులారా, వినండి వినండి. చారు దత్తుడు అమాయికుడు. శకారుడే చంపాడు వసంతసేనని. శకారుడే చంపాడు!

గో—నువ్వు చెప్పేది నిజమేనా?

స్థా—నిజం, నిజం.

గో—సిచ్చడిపోయింది. మ రేటిలాబం యిప్పుడూ!

స్థా—నేను యథార్థం అధికారులతో చెప్పబోతానని, నన్ను మేడగదిలో పెట్టి తాళంవేసి, నా కాళ్ళకి సంకెళ్ళు కూడా వేశాడు—ఆ రాక్షసిశకారుడు.

[L F నించి కంగారుగా శకారుడు వస్తాడు]

—ఇదుగో, వీడేవీడే హంతకుడు ! వచ్చాడు.

శ—స్థావరకా ! వచ్చావా ! ఇంటికిపోదాం రారా చిట్టితండ్రీ. రా అమ్మా, రా !

స్థా—ఛీ, నోరుమూసుకో, రాక్షసీ ! రత్నంలాంటి వసంతసేనని చంపేసి, కల్పవృక్షంలాంటి చారుదత్తుణ్ణి చంపిస్తున్నావ్ !

శ—ఒరీ పుత్రా ! నా రత్నాల బిందె, నా వజ్రాల సంచీ, నా కాసుల పేరూ ! నే నాడదాన్ని చంపుతాన్రా !

స్థా—ఛీ ఊరుకో ! నువ్వే చంపావు, నే చూశాను. చారుదత్తు డేమీ ఎరగడు.

శ—(తనలో) అన్నట్టు ఈకుంక ఆపని అంతా చూశాడు. వీణ్ణి ఇంకా గట్టిగా కట్టేసి రాకపోడం చిక్కొచ్చింది.

(అని వాణ్ణి బెల్లించి, వాడికి దణ్ణంపెట్టి, వాడి చేతులో కొన్ని సువర్ణాలు పోస్తాడు)

(పైకి) అయ్యా ! వీడు చెప్పింది అబద్ధం. వీడు నా బంగారం తస్కరించాడు. అందుకని వీణ్ణి బంధించాను.

స్థా—(సువర్ణాలు చూపిస్తూ) అయ్యా! చూడండీ! నాకు బంగారం లంచం యిచ్చి నన్ను అబద్ధం ఆడమం టున్నాడు.

శ—(సువర్ణాలు లాక్కుని) అమ్మా! నాదగ్గిర వీడు పూర్వం తస్కరించిన బంగారం ఇదే. దీనికోసమే వీణ్ణి నేను బంధించి గొలుసు వేశాను.

స్థా—ఘోరా! దాసరికంయొక్క ఫలం ఇంతేకదా! నిజంచెప్పినా చెల్లదే! ఆర్య చారుదత్తా! నాశ్రమ నిష్ఫలం అయింది.

చా—నాయనా! ఇది నీ యత్నం లోటుకాదు, నా కర్మఫలం!

శ—(స్థావరకుడితో) ఒరీ! నువ్వు మరి పోతావా లేదా, శని! (అని వాణ్ణి తరిమేస్తాడు).

—ఒరేయి, అబ్బాయిలూ! మంచి పోతుల్లా ఉన్నారు, ఇద్దరూను, ఈ చారుదత్తుణ్ణి త్వరగా చంపే సెయ్యండిరా, మీదుంప తెగా!

గో—ఏటయ్యా సీతొందరా! అయితే నువ్వేసెయ్ యీపనీ!

రో—మానాన్నని వద్దు నన్ను చంపండి.

శ—ఒరేయి, వాళ్ళిద్దర్నీ కూడాట, చంపెయ్యండిరా కాస్తా!

చా—(రోహసేనుడితో) ఈశని ఏంచెయించినా చెయించగలడు. అమ్మదగ్గిరికి పో అమ్మా!

రో—పోనీ. ఏమి చెయ్యనూ !

చా—సన్యసించు. నాలాగా ఉండకు. మైత్రేయా, వీణ్ణి తీసుకుపో.

మై—నువ్వు లేకుండా నేనుండగా ?

చా—నీయిష్టంగాని, మొదట వీణ్ణి తల్లి కప్పగించు.

మై—(చారుదత్తుణ్ణి కౌగిలించుకుని కాళ్ళకి మొక్కుతాడు)

రో—(తండ్రి కాళ్ళకి మొక్కుతాడు)

శ—ఒరేయ్ ! ఇల్లానేనా పని చెయ్యడం ? ఉండండి నీ పెళ్ళి చెయిస్తాను మా బావతో చెప్పి !

గో—మళ్ళీ ఎందుకూ వెనకే అయిపోయిందయ్యా మా పెళ్ళి !

శ—ఆ కుర్రాణ్ణికూడా ఒక్కిరవ్వ చంపి ఊరుకోండర్రా అంటే, అల్లా తెల్లపోయి చూస్తారేం జంతువుల్లాగా !

గో—అతికార్ల సెలవు లేదండీ, అబ్బాయిని సంప టాకి ! అబ్బాయి, నువ్ పో. నువ్వాపోవయ్యా !

(రోహసేన మైత్రేయులు R F కి పోతారు.)

శ—ఒరీ స్త్రీహంతకా, చారుదత్తా ! నీనోటితో అనరా వసంతసేనని నువ్వే చంపినట్టూ !

చా—(ఊరుకుంటాడు)

శ—(పక్కనించి కర్ర తెచ్చి ఆ హింతగాడితో) ఒరీ, పెద్దోడా ! దీంతో వాణ్ణి దంచరా, వసంతసేనని తనే చంపినట్టు వీడు ఒప్పుగునేదాకా !

చా—ఆమాట అబద్ధంగనక అనను, మీరు నన్ను కొట్టిచంపినా సరే, నరికి చంపినాసరే, మీయిష్టం!

ఆ—ఒరే, నువ్వేయ్యరా!

గో—నువ్వేయొయ్! నేనైతే కొంచెం ఆగాలి.

ఆ—ఎందుకూ ఆగడం యేసెయ్యకా?

గో—మానాన్న అల్లా ఆగమన్నాడు. ఆలోపులో ఉన్న రాజు మారి కొత్తరాజు రావచ్చు, రాజుగారికి కొడుకు పుట్టచ్చు, ఏనుగు తెంపుకుని బరినిపడచ్చు. అప్పుడల్లా సంపదలసినోళ్లే వొదుల్తారు.

శ—ఏమిరా, మీ ఆలస్యము!

ఆ—యేసేత్తానుండవయ్యా! చారుదత్తుడు గారూ! అతికార్ల సెలవైంది. మాకేమీ పాపంరాదు. ఇది మా పని, తల్చుగునే దేటేనా ఉంటే తల్చుగో.

చా—సిద్ధంగాఉన్నాను. సంపేచోటు ఏది?

ఆ—(L B కి చూపించి) ఇక్కడే, సాశానంకాడ.

(రెండో తెర లేస్తుంది)

చా—(నడిచి L B, L M మధ్య కూర్చుంటాడు.)

శ—(తనలో) వీడి శవాన్ని చూసిగాని నేను వెళ్ళను. ఇక్కడేఉంటాను. (అని R M కి వెళ్ళి నక్కుతాడు.)

గో—చారుదత్తుడుగారూ, నీకు బయమేత్తోందా?

చా—భయం ఎంతమాత్రం లేదు.

గో—బయపక్క [illegible] సెప్తే [illegible] కొత్తసంచి వస్తది.

ఆ—(కత్తి సిద్ధంచేసి, చారుదత్తుణ్ణి వెళ్లకిలా పడుకో పెట్టి) సిద్ధంగా ఉండవయ్యా!

చా—సిద్ధం. హా! వసంతసేనా!

ఆ—(కత్తి ఎత్తబోయి, పట్టుతప్పి అది కిందపడి పోగా) అరే! ఆచ్చెర్రెం! ఇది పడిపోయిందే! ఈనకి ఈముప్పు తప్పిపోద్దాయేటి సెప్మా! ఒరేయ్! గోడా! నా కచ్చిరాలేదు. నువ్వెయ్యహెయ్!

గో—(కత్తి పుచ్చుగుని సిద్ధం అవుతాడు.)

(L F నించి మొదట సన్యాసీ అతని వెనకాలే వసంతసేనా గబగబా వస్తారు. సన్యాసి చారుదత్తుడి కాళ్ళమీదా, వసంతసేన చారుదత్తుడి రొమ్ముమీదా వాల్తారు.)

—(కత్తి పారేసి) ఓరన్నా సూశావా! ఈ మడిసే ఆ వసంతసేన గాబోసు. ఈపాటికిన్ని సంపేశాంకాం, నయమే.

స—ఒరే! ఈయన జీవించిఉన్నాడా?

గో—ఆ ఆ. నూరేళ్ళుంటాడు.

స—బుద్ధదేవా, నమస్కారం! వసంతసేనా, ఈయన సజీవుడే!

వ—(లేచి) అమ్మ! ఆయన కాదు, నేను ఇప్పుడు సజీవురాలిని.

గో—ఉహింతా. హోయి ఈసంగతి అతికార్లతో మనం సెప్పుకోవాలా? మనపని మనం కానియ్యాలా?

శ—(R F నించి వచ్చి) ఆఁ (అని, వసంతసేనని చూసి) ఈ బోగంది బతికేఉంది, బాబోయ్! ఇక నా ప్రాణం దక్కదు. (అని RM కేసి పారిపోతాడు.)

గో—వసంతసేనని సంపినోణ్ణి సంపమని అతికారుల ఆజ్ఞకదా, ఎళ్ళి ఈణ్ణి పట్టుగుంటాను. నువ్విక్కడుండు. (అని, తనూ RM కే పరిగెడతాడు.)

చా—(లేచి కూచుని, కళ్ళు పెద్దగా చేసి) మరణ శయ్యమీంచి నన్ను లేవదీసిన ఈవిడ ఎవరూ? వసంత సేనే! వసంతసేన చచ్చిపోయిందిగదా! చచ్చిపోయి ఇప్పుడు మళ్ళీదిగిందా, లేక ఇంకోరు ఆవిడరూపంలో వచ్చారా!

వ—మీకు కీటువంటి పాట్లు తెచ్చిపెట్టిన ఆ పాపిని నేనే.

చా—నిజంగా నువ్వేనా?

వ—ఆ. నిజంగా నేనే. మీకీ దురవస్థ ఎట్లా కలిగింది?

చా—నిన్ను చంపేసింది నేనని నామీద నేరం మోపారు.

వ—పాపం శాంతించాలి.

చా—(సన్యాసిని చూసి) వీరెవరు?

వ—నన్ను బ్రతికించిన పుణ్యాత్ముడు.

చా—మహాత్మా, తామెవరు?

స—నన్ను తమరు మరిచారు, నాయనా! నేను పూర్వం తమకు ఒళ్ళు పట్టేవాణ్ణి. తరవాత జూదంలోపడి ఓడి ఋణపడగా ఈతల్లి నన్ను రక్షించింది. తమ వాణ్ణని నేను ఈమెతో చెప్పుకోగానే, నన్ను నెత్తిని పెట్టుకున్నది. వెంటనే నేను సన్యసించాను. బండి మారడమువల్ల ఈమె ఆ తోటలోకి వెళ్ళింది. ఆ శకారుడు ఈవిడ గొంతుకపిసికి పారేసి వెళ్ళిపోయాడు. తడబట్ట ఆరేసుకోడానికై నేనటు వెళ్ళి ఈవిణ్ణిచూసి సేదదేర్చి యింటికి తీసికెళ్ళాను.

శర్వి—(RF దగ్గిర ప్రవేశించబోతూ, పెద్ద గొంతికతో) దుష్టరాజైన పాలకుడు కడతేరిపోయాడు. ఆర్యకుడు రాజైనాడు. అతడి ఆజ్ఞప్రకారం ఆర్యచారుదత్తుణ్ణి కాపాడాలి. (అని పూర్తిగా ప్రవేశించి, కలియజూచి) అదుగో, ఆర్యభట్టారకుడు, అదుగో వసంతసేన! హా ఏమిపుణ్యం! ఏమిభాగ్యం!...కాని, ఈతడి యింటికి కన్నంవేసిన మహాపాతకినిగదా నేను! ఇతణ్ణి ఎట్లా సమీపించడం! కానీ! ఇతడు సర్వసముడుగదా! (అని, సమీపించి వంగి నమస్కరించి) ఆర్య చారుదత్తా!

చా—ఆర్యా! తామెవరు?

శర్వి—తమయింటికి కన్నంత్రవ్వి నగ తస్కరించిన అధముణ్ణి, మహాపాతకిని. శరణు ఇవ్వండి.

చా—ఆ సంగతి నాకు తెలియనే తెలియదు. మిత్రుడా, బాధ పడకు, ఏమీ భయంలేదు, (అని లేచి కౌగిలించుకుంటాడు.)

శర్వి—చారుదత్తమహాశయా! పాలక రాజుని తొలగించి ఆర్యకుడు రాజైనాడు.

చా—ఆహా! దైవకటాక్షం! ఎంత ఆశ్చర్యం!

శర్వి—మీ బండిఎక్కి మీ దగ్గిరికి రాగా మీరు అభయం ఇచ్చి మన్నించి దీవించి పంపించారే, అతడు!

చా—కారాగృహంలోంచి నీచేత విడిపింపబడ్డ గోపాలదారకుడేకదా!

శర్వి—అవును. అతడే.

చా—చాలా సంతోషం.

శర్వి—ఆర్యా! అతడు రాజైన వెంటనే మీ కుశావతీ రాజ్యం మీ కిచ్చేశాడు. ఓరీ! ఎవురురా! శకారుణ్ణి పట్టుగుని బంధించితీసుకురండి!...ఆర్యా! మీ సౌజన్యం తనకి నచ్చి, తనకివచ్చిన రాజ్యం మీ చిత్తాను సారం పాలించండి—అని, ఆర్యకరాజు మీతో మనవి చెయ్యవలిసిందన్నారు.

చా—ఔర! ఆయనకి ఎంత కృతజ్ఞత!

[R F నించి, శకారుణ్ణి రెక్కలు వెనక్కి విరిచికట్టి తన్నుతూ విటుడూ స్థావరకుడూ నడిపించుగొస్తారు.]

శ—(R F నించి దుఃఖిస్తూవచ్చి) అక్కడికీ నేను గాడిదలాగ పరిగెత్తానుగాని, నన్ను పట్టేశారు. నన్ను

కుక్కనికొట్టినట్టు కొట్టారు, పందిని కట్టినట్టు కట్టారు. ఇక్కడికి మేకని ఈడ్చుగొచ్చినట్టు ఈడ్చుగొచ్చారు. రోజులూ! ఏంజేస్తాం! చారుదత్తుడు మంచివాడేగా, నాలాగ కుళ్ళుపన్లు చెయ్యలేడుగా! వాళ్ళమీదపడతాను! (చారుదత్తుడి కాళ్ళమీదపడి) నన్ను మీరు రక్షించాలి, శరణుశరణు!

శర్వి—ఛీ. హృదయశూన్యుడా, గూఢజన్ముడా! ఛే!...ఆర్యా, మరి ఆలస్యంలేకుండా వీణ్ణి పైకి సాగనంపాలి. ఒక! వీణ్ణి ఆపక్కకి ఈడ్చు...చారుదత్త భట్టారకా! వీడికి శిక్ష చెప్పండి.

చా—నే చెప్పినట్టు చేస్తారా?

శ—ఆర్యా! శరణు! కాపాడండి. నేను జంతువుని, కీటకాన్ని, అణువుని. నన్ను పెంటమీద పారెయ్యండి.

వసం—(చారుదత్తుడి మెడలోఉన్న గన్నేరుదండ శకారుడి మెడికి వేస్తుంది.)

శ—ఓ భోగంఅమ్మాయి! రక్షించుతల్లీ! నిన్ను ఇక నెప్పుడూ మోహించను. మళ్ళీ ఎప్పుడేనా నిన్ను చంపితే; నే చచ్చినంతఒట్టూ! రక్షించు.

శర్వి—ఆర్యా, చెప్పండి.

చా—నే చెప్పినట్టు చేస్తారా?

శర్వి—తమరి మాటకా అడ్డు?

చా—అట్లాయితే, శత్రణ్ణి, శీఘ్రంగా...

శర్వి—చంపేసెయ్యమా ?

చా—అక్కో, కాదు. వదిలెయ్యండి.

శర్వి—(ఆశ్చర్యంతో) ఏమిటీ, వదిలెయ్యమన్నారా!

చా—శరణు అని పాదాలమీద పడ్డాడుగదా !

శర్వి—నిజమే, ఆర్యా, పాదాలమీద పడ్డాడు. కాని, పాదాలమీద పడి శరణు వేడుకుంటూనే, ఆపాదాలే నరికేరకం వీడు ! పోనీ, వీణ్ణి తరవాత హింసించమా ?

చా—తరవాతకూడా హింసించవద్దు.

శర్వి—ఏమి ఆశ్చర్యాం !

చా—మనసంగతి మన కాశ్చర్యం కానప్పుడు, పరులగురించిన దైనంతమాత్రాన్ని ఆ సంగతే మనకి ఆశ్చర్యంగా ఎందుకుండాలీ ? వీణ్ణి తరవాతా ఏమీా చెయ్యొద్దు.

శర్వి—చిత్తం. గ్రహించుగున్నాను. వీణ్ణి వది లేస్తాను. తరవాతకూడా హింసించను. (అని శకారుణ్ణి వది లేస్తాడు.)

శ—అమ్మయ్య ! ఈయన మంచివాడని నాకు మొదణ్ణించీ తెలుసు. (అని RM కి పరిగెట్టిపోతాడు.)

(L F నించి ఉసూరుమంటూ చందనకుడు వచ్చి కూచోపడతాడు. శర్విలకుడు అతని దగ్గిరికి పరిగెట్టి అతణ్ణి పట్టుగుంటాడు.)

చం—కటకటా!

శర్వి—ఏమిటేమిటి! చందనకా

చం—అయ్యో! ఇంకేముందీ!

శర్వి—త్వరగా చెప్పు!

చం—(చెప్పలేక చెప్పలేక) ధూతాదేవిగారు!... (అని మరి చెప్పలేకపోతాడు.)

చా—హా! (అని, కళ్ళుమూసుకుని. తల పట్టుకుని, కూచోపడిపోతాడు.)

వ—అయ్యో! (అని కేకేసి, చటుక్కున, చందనకుడు వచ్చిన L F కి నిష్క్రమిస్తుంది.)

శర్వి—చందనకా! నిబ్బరంగా చెప్పు. ధూతాదేవిగారు...

చం—ఓ పక్క కొడుకూ ఓ పక్క మైత్రేయుడూ బతిమాలుకుంటూన్నా వినక, అగ్నిగుండంలో దూకడానికి సిద్ధంగా ఉంది.

శర్వి—అయ్యయ్యో! ఏం?

చం—భర్తగారి మరణంగురించిన వార్త తెలిసే లోపల తన ప్రాణం త్యజించడానికి.

శర్వి—అరెరే దైవమా! ఈయన క్షేమవార్త ఆమెకు తెలియదుకాబోలు! చందనకా! ఊరుకో, ఇదుగో ఆర్యచారుదత్తుడు, భద్రంగా ఉన్నారు. ఆవిడకి అపాయం తటస్థిస్తే మన యత్నాలన్నీ వ్యర్థంగదా! తక్షణం వెళ్ళి

ఆవిణ్ణి ఆపేసి తీసుకురావాలి, (అని L F కి వెళ్ళడానికి సిద్ధ పడతాడు.)

చా—అయ్యో! అర్థాంగీ!

శర్వి—అయ్యా, ధైర్యం తెచ్చుగోండి. ఇంత చేసిన దైవం ఆవిణ్ణికూడా రక్షించకపోడం జరగదు. చందనకా! అక్కడ రదనిక ఉన్నదా! సరిసరి! పోదాం.

[L F నించి, వసంతసేన ధూతాదేవి చెయ్యి పట్టుగుని ప్రవేశిస్తుంది. వెనకాల రోహసేనుడూ, రదనికా, మైత్రేయుడూ వస్తారు. ధూతాదేవి వెళ్ళి చారుదత్తుడి పాదాలకి మొక్కుతుంది. చారుదత్తుడు ఆవిణ్ణి లేవదీసి నుదుట ముద్దుపెట్టుగుంటాడు. రోహసేనుడూ మైత్రేయుడూ చారుదత్తుణ్ణి కౌగిలించుగుంటారు. తరవాత రదనిక చారుదత్తుడికి మొక్కుతుంది. చారుదత్తుడు రదనికని లేవ దీస్తాడు.]

ధూ—(వసంతసేనతో) చెల్లెలా! నీ పుణ్యంవల్ల నేను జీవించాను.

వ—(చారుదత్తుణ్ణి చూపించి) వారివల్ల నా హృదయం, (సన్యాసిని చూపించి) వారివల్ల నా శరీరం, (ధూతాదేవిని చూపించి) మీవల్ల నా ఆత్మా జీవందాల్చాయి. నా జీవితానికి ప్రారంభం ఈ క్షణమే.

శర్వి—ఇదంతా ఆర్యచారుదత్తుని సుగుణబలం!

చా—కాదు. ఇదంతా మీ అందరియొక్క అను గ్రహం!

వసం—కాదు. ఇదంతా ధూతాంబగారి అదృష్టం!

మై—కాదు. ఇదంతా కేవలం నా పూర్వజన్మ సుకృతం.

శర్వి—ఆర్యా! ఈ సన్యాసిని ఏరీతిగా సత్కరించా లని తమ సెలవు?

చా—బౌద్ధ విహారాల కన్నింటికీ ఇతన్ని కులపతిగా చెయ్యి. స్థావరకుడికి దాస్యం తొలిగించెయ్యి. ఆ చండా లుర్ని చండాలరాజులుగా చెయ్యి. చందనకుడు దండపాల కుడు అవుతాడు!

శర్వి—ఆర్యా! అన్నీ తమ రన్నప్రకారం జరి గిస్తాను.

వసం—(చారుదత్తుడితో) ఆర్యా! ఈ శర్విలక మహాశయుడు మా దాసీ మదనికని పెళ్ళిచేసుగుని ఆవిణ్ణి ఉద్ధరించాడు.

చా—అల్లానా! ఇతడి సమత్వభావానికి ఇతణ్ణి అభినందిస్తున్నాను.

(వర్ధమానకుడు కుడిఎడరనించి వస్తూ ఒక పత్రం తెచ్చి శర్విలకుడికి ఇస్తాడు.)

శర్వి—(పత్రం పుచ్చుగుని చూసి చదువుకుని) ఆహా! మిక్కిలి సంతోషం! వసంతసేనా! ఆర్యకరాజు నిన్ను వధూశబ్దంతో గౌరవించడానికి అంగీకరించాడు.

వసం—(తలవంచి నుదుట చేతులుజోడిస్తూ) ఓ సేనానీ! కృతార్థురాల్ని!

చా—ధన్యులం!

(అందరూ కళ్ళుమూసుగుని, తలలువంచి, నమస్కారాలుపెట్టి నిలబడిఉండగా, తెర పడుతుంది—మంగళం.)

